# పల్లెటూరు

సాంస్కృతిక మాసపత్రిక

ఖర, పుష్యము



సంపాదకుడు

**దేవీప్రసాద్**

సంయుక్త సంపాదకుడు

**రాంచంద్రారెడ్డి**



సంగారెడ్డి

15 జనవరి

1952

సాలు చందా రు. 6 — విడి పత్రిక అ. 8

# 'పల్లెటూరు'

## విషయానుక్రమణిక


| | | పుట |
|---|---|---|
| ౧. | సంపాదకీయము | ౧ |
| ౨. | కోడిన పదాలు : శ్రీ చో. న్న. శర్మాకవి | ౨ |
| ౩. | పార్టీలు - ప్రణాళికలు | ౪ |
| ౪. | దంపుడు పాట : శ్రీ ప్రసాద్ | ౧౧ |
| ౫. | రభస : శ్రీ కోట శ్రీనివాసరావు | ౧౩ |
| ౬. | ఎన్నికల విశేషాలు - కొన్ని యంకెలు : శ్రీ కృష్ణకుమార్ | ౧౭ |
| ౭. | గ్రామచావడి - రచ్చకట్ల ముచ్చట్లు | ౧౮ |
| ౮. | నేటి వనపర్తి తాలూకా | ౨౦ |
| ౯. | ఎలక్షన్ల హడావుడి : శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు | ౨౩ |
| ౧౦. | వార్తలు - విశేషాలు | ౨౫ |
| ౧౧. | గ్రంథపరిచయము | ౨౬ |


## రచయితలకు మా ప్రార్థన

రచయితలు తమ రచనలను కాగితమున కొకప్రక్కనే, గిలిపి చిత్తుప్రాత లేకుండ పేజీ నెంబరుయుక్తముగా బంపిన ముద్రణకెంతో సౌకర్యము కలుగును. ప్రతి మాసమున రచనలు 30 వ తేదీవరకు పంపిన 15 తేదీ వెలువడు సంచికలో ప్రకటించుట కనువుగా నుండును. సహకారసంఘములు, కుటీరపరిశ్రమలు, వ్యవసాయ పశుపోషణ, ఆరోగ్య వైద్య శిశుపోషణ, వయోజనవిద్య, తోటపని మొదలగు సాంఘిక, నైతిక, చారిత్రక కథలలో నొప్పు మా పల్లెటూరు యాశయములు మీ కెరిగించుచున్నది.

సదా మీ పరిచయమునుగోరు

సంపాదకుడు

"పల్లెటూరు"

ముఖచిత్రం : సాధనసమితి సౌజన్యంతో

# పల్లెటూరు

## సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి ౧ | ఖర పుష్యము | సంచిక ౩


## సంపాదకీయము

ప్రజాస్వామ్య నూతన రాజ్యాంగ యెన్నికలు మన హైదారాబాదు రాష్ట్రమున 1951 సం॥ర డిసంబరు 21వ తేదిన జన్మించి దినదినాభివృద్ధిగాంచి 1952 నూతన సంవత్సరమునాహ్వానించినవి. 1951వ సంవత్సర తుదిమాసమున 1952వ సంవత్సర మొదటి నెల ఈ ఎన్నికలు దక్షిణాయన ఉత్తరాయణ మకర సంక్రమణమును సూచించుచున్నవి. మకర సంక్రమణముగూడ ఈ నెల 14వ తేదిన జరుపబడినది. దీనితో ఈ మనరాష్ట్ర యెన్నికలు సమాప్తము కాబడినవి. అప్పుడే ఉత్తరాయణ పుణ్యకాల ఘటికలు. ఇదంతా కురుక్షేత్రయుద్ధ వీరుల జయాపజయములంబోలె యిట యెన్నికలుసాగినవి. విజయరథమున శ్రీ కృష్ణుడు గీతామృతమును వెదజల్లినట్లు పండిత శ్రీ జవహరులాలుగారు సమైక్యతా సద్బోధనల గావిస్తు కాంగ్రెసు యెన్నికల రథమును కదలించినారు. ఈ పోరాటమున కాంగ్రెసుకు విజయముతప్పదు. యుద్ధవీరులు పేరుజెప్పి తమ బలాబలములనుపొగడు కొన్నట్లు వివిధ ముఖ్య పార్టీల వ్యాఖ్యాతలు యెన్నికలప్రచార రంగమున తమతమ పార్టీల బలాబలములను పొగడుకొనిరి.

విజయాపేక్షతో పార్టీలమూలకముగా పార్టీలపక్షమున వర్తించిన కార్యకర్తలు ఏజంట్లు ఓటర్లు వీరలలో కలిగిన విబేధములు యెన్నికలనంతర మట్లేనిలిచి, వైమనస్యానల స్వరూపముదాల్చకుండా సమైక్యతలో ప్రజాస్వామ్యవిధానము భావిరాజ్యాంగమున నెలకొని పల్లెటూరి ప్రజల యన్యోన్యానురాగములు వెల్లివిరియ బడాలని కూడు గుడ్డ సుఖ సంపదలు సుస్థిర పడాలని నూతన ప్రభుత్వ నిర్మాతలకు మా మనవి.

ఈ నెల 18వ తేదికి ఎన్నికలు సమాప్తము కానున్నవి. విజయముపొందిన యభ్యర్థులకు మా పల్లెటూరు సుస్వాగతమలంపుచున్నది. ప్రజలు తమ శ్రేయస్సుకై తమ యిష్టమువచ్చిన పార్టీకి ఓటు హక్కును వినియోగించుకున్నారు. ఇట్టి స్వాతంత్ర్య హక్కును గమనించి గెలుపొందిన యభ్యర్థులు కలిగిన పార్టీవిబేధాలను తుడిచిపెట్టి ప్రజాదరణను బడయువలసియున్నది. మకర సంక్రాంతితో గూడిన ఉత్తరాయణ 1952వ నూతన సంవత్సరము మా పల్లెటూరి ప్రజలకు శాంతి సౌఖ్యములు భావి రాజ్యాంగ నిర్మాణమున ఫలప్రదము జేయుగాక.

# కోఁడివ పదాలు

శ్రీ చొ॥ నృ. శర్మకవి

( హైస్కూలు : భువనగిరి )



౧

ఆ. వె. కారులెక్కి తిరుగు - వారుకాంగ్రేసులు.
కష్టజీవులెల్ల - కమ్యూనిస్టు
సోషలిస్టు లొంగి - నూచేసు పిల్లులు.
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల.

౨

అన్నమడుగునంత - తన్నును పోలీసు
అక్షరంబులడుగ - కుక్షిచీల్చు
అక్రరాజ్యనీతి - సాక్షియిదే సుమ్మి
తెలిసికొమ్మ లీల - తెలుగుఁబాల

౩

కూడు గుడ్డ, యింక - కొంపలు లేకుండు
మందుమాకు లేక - మాడుచుండ్రు,
రామరాజ్యమందు - రాణించు ప్రజలంత
తెలిసికొమ్మ లీల. తెలుఁగుబాల

౪

నాల్గుజాములెండ - నాగలి దున్నిన
కాపుబిడ్డ ఖైదు - ఖానయుండ
కరువు కాటకములు - కలుగవా రాజ్యాన
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

౫

అరయు హద్దుపద్దు - లధికారులకు లేవు
సత్యసంధులైన - జనులు లేరు
క్రొత్తక్రొత్త బ్రహ్మ - కూర్పులు వేలుగా
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

౬

ఎన్నివ్రాతలైన - సున్నచుట్టగవచ్చు
బ్రహ్మవ్రాతపైన పడదు సున్న
సున్న నెఱుఁగు వాడు - సున్నితుఁడేగదా
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

౭

పరగు హిట్లరుకును - పళ్లెక్కటే గాని
స్టాలినునకు వాఁడు - సాటిరాడు
ముస్సొ బుడిసి పడెడు - పురుషావతంసుఁడు
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

౮

కసిని తీర్చుకొనును - కన్సర్వేటివ్‌పార్టీ,
చర్చిలయ్యచేయు - చర్చలకును.
యుద్ధరంగములును - తద్దయు పెరుగును
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

౯

గోవుజాతులందు - గొప్పలిక లిత్తుగో
అమర వాణిలోన - అమెరిగొప్ప
మనువులందు గొప్ప - మనువుపో ట్రూమను
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

౧౦

శస్త్రధారులకును - సన్మాన మీనాడు
వస్త్రధారి పరువు - నమ్మనయ్యో
అస్త్రశస్త్రములకు - అవని తొక్కిసలాడు
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

౧౧

బందిఖానలకును - భవనాలు కట్టించు
బీదవాని గుడిసె - పేరుగొనడు.
నాటి నేటి నేత - మాట పాటొక్కటే
తెలిసికొమ్మ లీల - తెలుఁగుబాల

కోఁడిన పదాలు.

౧౨

పాడి పంటలన్ని - పట్నంబునకు పంప
మేసికుంటు పట్న - వాసి యిల్లు
"పల్లెటూరి జంగ్లి - ఫంటోతుక వెధిష్టు"
తెలిసికొమ్ము లీల - తెలుఁగుబాల

౧౩

బ్లాకు మార్కెటీర్ల - పైపగలెందుకు
లంచమీయకట్టి - కొంచెగాడ!
కొలతతిండి బట్ట - కొఱతలేదతనికి
తెలిసికొమ్ము లీల- తెలుఁగుబాల

౧౪

ఇంటిదొంగవాని - ఈశ్వరుడైనను
పట్టలేడు - బ్లాకు భాగ్యవంతు
పట్టలేరు యిదియె- పరమరహస్యము
తెలిసికొమ్ము లీల - తెలుఁగుబాల

౧౫

మొన్న మొన్నదాక - పన్నెండు రూకలు
నేడుగొప్ప జీత - గాడునయ్యె
మోజుపుట్ట జేయు - నైజాము లుండరా
తెలిసికొమ్ము లీల - తెలుఁగుబాల

౧౬

ధాన్య గలిగినపుడె - ధాన్యాలగ్గావాలె
ధాన్యగలిగినపుడె - చదువ వలెను
ధాన్యలోన నున్న - సైన్స తత్వంబును
తెలిసికొమ్ము లీల - తెలుఁగుబాల

౧౭

మేలుచేయువాఁడు - మేకాధ్రా కాడు
గాయ పఱచువాఁడు - గాంధికాడు
కీడు చేయువాడు - కేయము - మున్షియా
తెలిసికొమ్ము లీల - తెలుఁగుబాల

౧౮

పార్టిపైన పార్టి - ఏడిగడి వచ్చిన...
పార్టినిచ్చువాడు - పడయు జయము
ఆసుపైన ఆసు - వేసికోసిన యాఁట
తెలిసికొమ్ము లీల - తెలుఁగుబాల

౧౯

భరత భూమి ప్రజల - పాలించ లాలించ
నెహ్రు పనికిరాని- నేతమైన
భాగ్యరాసులిచ్చి - పాలించు నెవ్వండు
తెలిసికొమ్ము లీల - తెలుఁగుబాల

౨౦

వెన్నుచరచువాఁడు - వెఱ్ఱివెంగళి యప్ప
నెత్తి మీఁదివాఁడు - నీ నియంత
ఈవె నేతవయ్యె - ఏలుము ప్రాచ్యంబు
తెలిసుకొమ్ము లీల - తెలుఁగుబాల

౨౧

అణువుబాంబుకలదు - అమెరికాదేశాన
పాడిపంటకలదు - భారతమున
మహిళసంఖ్యకలగు - మలియాలమునకద్దు
తెలిసికొమ్ములీల- తెలుఁగుబాల

౨౨

గాంధి నెహ్రు కృపను - గద్దెలనెక్కిన
బూర్గులయ్యగొ - పూలుచందు
బసవరాజుపసలు - నెసగు హైదరబాద
తెలిసికొమ్ములీల - తెలుఁగుబాల

౨౩

బిరుదులున్నవారు విజ్ఞులు ప్రాజ్ఞులు
బిరుదు లేకయున్న వెఱ్ఱివెధవ
ముందువెనుక బిరుదుముచ్చటగొప్పగా
తెలిసికొమ్ము లీల తెలుఁగుబాల

౨౪

పోరులందు మడయువారు గ్రామీణులు
పేరులందువారు పెద్దవారు
పౌరహక్కులింక పాటించునెవ్వండు
తెలిసికొమ్ము లీల తెలుఁగుబాల

౨౫

మద్యపానముకు మద్రాసు సిద్ధము
గుంపుజనులచోట కుస్తీయమలులు
ముడుపులే వినిడగముంబయి సిద్ధము
తెలిసికొమ్ము లీల తెలుఁగుబాల

# పార్టీలు - ప్రణాళికలు

## వాటిలక్ష్యాలు - కార్యక్రమాలు

1952 జనవరి రెండవ తేదినుండి మద్రాసు రాష్ట్రములో ప్రారంభమైన యెన్నికలగూర్చి రిపోర్టుచేస్తూ ప్రతిపార్టీ ఆశయాలు లక్ష్యాలనో తెలుపుటకై ఆయాపార్టీల వ్యాఖ్యాతలనోటినుండి నుడివిన పార్టీల ఆశయాలను ఆంధ్రసూత్రధారిగారు వెల్లడిగావించిరి. వాటిలో కొన్ని ముఖ్యవిషయాలను ఆంధ్ర పాఠకులు చదివి గ్రహించుకోవలసినది

కాంగ్రెసుపార్టీ ఆశయాలను శ్రీ శ్రీ ప్రకాశ గారు ఈ విధముగా తెలియజేసిరి

ఆదిలో కాంగ్రెసు ఆశయం బ్రిటీషు సామ్రాజ్యంలో ఒక భాగంగా, ఒక అధినివేశంగా వుంటే చాలునని మాత్రమే అని కాంగ్రెసు చరిత్ర చూచిన వారందరికీ తెలుస్తుంది. ఆ తర్వాత మహాత్మా గాంధీ నాయకత్వంలో కాంగ్రెసు ఆశయం సంపూర్ణ స్వతంత్రంగా మారింది. 1929లో లాహోరులో కాంగ్రెసు భారతదేశం సంపూర్ణస్వాతంత్ర్యం పొందగలట్లు పోరాటాన్ని సాగించడమే తన ఆశయమని ప్రకటించింది. స్వాతంత్ర్యాన్ని సాధించిన అనంతరం కాంగ్రెసు ఆశయము మరోవిధంగా మారింది. "అఖిలభారత ప్రజానీకం శ్రేయస్సు, అభివృద్ధి కాంగ్రెసు ఆశయాలు. ధర్మసమ్మతము, న్యాయవిహితము అయిన మార్గాలలో శాంతియుతంగా కాంగ్రెసు దేశంలో కో ఆపరేటివ్ కామన్‌వెల్తు సృష్టించాలనికూడా ఆశిస్తున్నది. కో-ఆపరేటివ్ కామన్‌వెల్తులో అందరకు సామాజికమైన, ఆర్థికమైన, రాజకీయమైన అవకాశాలు సమానంగా వుంటాయి. ప్రపంచ శాంతి సామరస్యాలు దీని ధ్యేయాలుగా వుంటాయి" అని కాంగ్రెసు ప్రణాళికలో ఇప్పుడు పేర్కొనబడింది. ఈ విధంగా కాంగ్రెసుకూడా ఒక రాజకీయపక్షంగా యీ దేశంలో యిప్పుడు రూపొందింది. ఇక యే ఆశయంకోసం కాంగ్రెసు కృషిచేస్తుందో ఏ ప్రణాళికలను అమలు జరపడానికి కాంగ్రెసు యికముందు నడుంకట్టుకుంటుందో, కాంగ్రెసు ప్రణాళికలో స్పష్టంగా విశదం చేయబడివున్నాయి. మరి కాంగ్రెసు తిరిగి అధికారంలోకి వస్తే, ఆ ఆశయాలు, ఆ కార్యక్రమాలను అమలు జరపడానికి పూనుకుంటుంది.

ప్రస్తుతం మనదేశంలో ప్రతిపార్టీయొక్క ముఖ్య ధ్యేయం యేమిటంటే, ప్రజలను మంచిపౌరులుగా తయారుచేయడం అన్నది. అందుకు కాంగ్రెసు తప్పకుంటుగ శాసనసభలు పార్లమెంటు, ప్రభుత్వాలు వీటిల్లో ఏ పనిచేసినంతమాత్రంచేత కాంగ్రెసు కార్యక్రమం అంతా అమలు జరగదు. అదీకాక కాంగ్రెసువాదులు అంతాగూడా ఈ శాసనసభల్లోకి ఇమిడిపోవటమూ కష్టమే. కొంతమంది ఈ కార్యకలాపాలు నిర్వహిస్తూవుంటే కొంతమంది ఇంకా యిటువంటి తక్కినపనులు చేయవలసి వుంటుంది. ఆ చేయవలసిన తక్కినపనులు యెన్నో వున్నాయి. విద్య వైద్యం వ్యాపారం, పరిశ్రమ, కృషి, సంఘసేవ యివన్నీకూడా జతపడి ప్రభుత్వ కార్యకలాపాలకు అన్నివిధాలా తోడుగా నిలబడుతూ వుండాలి. ఇప్పుడు శాసనసభల్లోనూ ప్రభుత్వాలోను స్థానంలేని కాంగ్రెసువాదులంతా స్వధర్మంఅంటే సమితో స్వయంగా యేతద్ధర్మాన్ని, అనుసరించి నడుస్తూ, ప్రచారంచేస్తూ మరోరాజకీయవేత్త దగ్గరనుంచి, గురుపుచ్చుకు వీధులు ఊడిచేవారిగాని యెవరి పనులు వారు చేయడం అంటే దేశానికి సేవచేయడమేనని, స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకోవడమేనని నిరూపించాలి.

స్పష్టంగా చెప్పాలంటే- కాంగ్రెసు దేశ స్వయం సమృద్ధికోసం కృషి చేస్తున్నది. ఈ స్వయంపోషకత్వాన్ని సాధించాలని పట్టుదలవహించివుంది. అంతర్జాతీయ సామరస్యం, సహకారం కాంగ్రెసు ఆశయాలు. దేశంలో ఐకమత్యంకోసం, మతైకవాదాల నిర్మూలన నిమిత్తం కాంగ్రెసు కృషిచేస్తున్నది. అంటే మత స్వాతంత్ర్యాన్ని రక్షించదని కాదు. రక్షిస్తుంది. ప్రతి ఒక్కపౌరుని అభివృద్ధి కాంగ్రెసు ధ్యే

యంగా పెట్టుకొన్నది. మంచి పౌరుని తయారుచేసితద్వారా దేశస్వాతంత్ర్యానికి చక్కని రక్షను చేకూర్చడమేగాక, ముందుముందు దేశంయొక్క సర్వతోముఖాభివృద్ధికి కాంగ్రెసు కృషిచేసుంది. ఇంతకన్నా కాంగ్రెసు ప్రస్తుతానికి వాంఛించేదేమీ లేదు. ఈ మధుర స్వప్నాన్ని యధార్థంచేసినిరూపంచేందుకు ఈ ఎన్నికల్లో తనకు విజయంలభించాలని ప్రతి కాంగ్రెస్ వాది ఆశిసున్నాడు.

## ప్రజాపార్టీ

ఆచార్య కృపలాని ప్రజాపార్టీ పుట్టుకనుగురించి, ఆ పార్టీ ఆశయాలను గురించి వివరించారు. ఆ మాటలు నాల్గు పాఠకులు తెలుసుకోవాలి.

అయితే ప్రజాపార్టీ ఆశయాలు ఏమిటి? లక్ష్యాలు ఏమిటి అని ప్రశ్నిస్తారు గాబట్టి వాటిని గూడా స్పష్టంగా వివరిస్తాను ప్రజాపార్టీ ఆశయం సర్వోదయ సమాజాన్ని సృష్టించడం. కులమతవర్గ విహీనమైన సంఘాన్ని నిర్మించడం. ఏతన్నిర్మాణానికి ప్రజాపార్టీ గాంధీ మార్గాలను అనుసరిస్తుంది. పెద్ద పెద్ద పరిశ్రమలను స్థాపించినంత మాత్రంచేతనే దేశం బాగుపడిపోతుందని మా అభిప్రాయం కాదు. పాశ్చాత్య దేశాలలో పరిశ్రమలు వున్నాయంటే అవి ఇతర దేశాలను దోయడం కోసమున్నూ, యుద్ధాలు సాగించడం కోసమున్నూ వున్నాయి. అందువల్ల వారిలాగే ఇక్కడ గూడా పరిశ్రమలను అదేవిధముగా నెలకొల్పడం మా లక్ష్యం కాదు. అందువల్ల ప్రజాపార్టీ పరిశ్రమలను వికేంద్రీకరణాన్ని ప్రపంచిస్తున్నది. మరి ఈ కార్యక్రమం సుఖంగా కొనసాగాలంటే విద్యుచ్ఛక్తి అమితంగా అవసరం. అందువల్లదేశంలో విద్యుదుత్పత్తికి ప్రజాపార్టీ అధిక ప్రాముఖ్యం ఇస్తున్నది.

అయితే వికేంద్రీకరణానికి అసాధ్యమైన పరిశ్రమలు కొన్ని వున్నాయి. అవిగాక రక్షణ పరిశ్రమలు కొన్ని వున్నాయి. రక్షణ పరిశ్రమలను ప్రజాపార్టీ జాతీయం చేస్తుంది. వికేంద్రీకరణ సాధ్యం కాని పరిశ్రమలను సమాజాయత్తం చేస్తుంది. పరిశ్రమలను జాతీయం చేయడానికి, సమాజాయత్తం చేయడానికి ఒక భేదంవుంది. పరిశ్రమలను అన్నింటిని జాతీయం చేయడంవల్ల స్టేట్ కేపిటలిజం, ఆ స్టేట్ కేపిటలిజం ద్వారా, నియంతృత్వం ఉద్భవిస్తున్నాయి. సమాజాయత్తం చేయడంవల్లనే ఈ దోషాలు పరిహృతాలవుతాయి. పరిశ్రమలకు సంబంధించిన అన్ని వర్గాలవారి పరంగానూ, ఇవి నడుపబడతాయి. పెట్టుబడిదార్లకు, కార్మికులకు, ప్రభుత్వానికి ప్రజలకు, ఈ యాజమాన్యంలో ప్రాతినిధ్యం వుంటుంది.

వ్యవసాయం విషయంలో ప్రజాపార్టీ దున్నేవాడిదే భూమి అన్న లక్ష్యంతో పనిచేస్తుంది. సేద్యసంపదనంతా సమీకరించడం, సహకార పద్ధతులమీద సేద్య విస్తృతికి పూనుకోవడం పార్టీ ఆశయాలు. వ్యవసాయం పని లభించనివారికి పరిశ్రమలు చూపెట్టి తీరాలి. అట్లా వారికి పని చూపెట్టాలి అంటే, కుటీర పరిశ్రమలను ఎక్కువగా అభివృద్ధిచేయాలి. అటి పరిశ్రమలలో పనిచేసేవాళ్లు ప్రొలిటేరియట్ గాక, వృత్తిజీవిగా రూపొందుతారు. ప్రజాస్వామ్యం అన్నది ఇట్టి వృత్తిజీవులవల్ల, స్వయంపోషకంగా వున్న రైతాంగంవల్ల అభివృద్ధిలోకి వస్తుంది. ప్రపంచంలో ఏరకమైన నియంతృత్వం తలయెత్తినా నగరవాసులైన నిరుద్యోగి కార్మికులవల్ల, అట అడుగు మధ్యతరగతులవారి వల్లా ఉద్భవిల్లాయి. ఒకటి కార్మిక నియంతృత్వమైతే, మరొకటి మితవాద నియంతృత్వంగా రూపొందింది. ఈ నియంతృత్వాలు ఇక్కడ గూడా తలయెత్తకుండా వుండాలంటే, నేను పైన పేర్కొన్న మార్గమేమార్గం.

ప్రజాపార్టీకి గాంధీవాదంలో సంపూర్ణమైన విశ్వాసం వుంది. ఆయనకు మల్లే ప్రజాపార్టీ వాదులకుగూడా అధికార వికేంద్రీకరణం అంటే విశ్వాసం వుంది. అంటే గ్రామ ప్రాతిపదికగా ప్రజాస్వామ్యం ఏర్పడాలని మా పార్టీ కోరుతున్నది. కేంద్రీకృతమైన పాశ్చాత్య ప్రజాస్వామ్యం వట్టి మూజువాణీ వ్యవహారంగా తయారైపోవడం అంతా ఎరుగున్నదే. ఒక వ్యక్తి శరీరం బలంగా వుండాలంటే, ఆ వ్యక్తి సర్వావయవాలు బలంగా వుండాలి. అట్లాగే ఒక రాజ్యం గూడా. అంగాలుగావుండేసర్వవ్యవస్థలుబలంగావున్నాడు అంగఅయిన రాజ్యంగూడాబలంగావుంటుంది.

మరి ఈ ఎన్నికలో ప్రజాపార్టీ విజయాన్ని సాధిస్తుందా అంటే, అనుమానమే ఇది సరిగ్గాపుట్టి ఇంకా 5, 6 నెలలు గూడా కాలేదు. కాంగ్రెసుకు వున్నంతటి వ్యవస్థీకరణం ప్రజాపార్టీకి ఎంతమాత్రం లేదు. అదీ కాక కొంతమంది ఉబలాటస్థులు ప్రజాపార్టీలో చేరడం, మళ్లీ విడిపోవడం అన్నీ జరిగాయి. మరి కాంగ్రెసుకు వున్న ఆర్థికబలం గూడా దీనికిలేదు ఇన్ని కష్టాలువుండి గూడా ఎన్నికల్లో పేరునిలుపుకోవాలని, దేశంలో కాలు నిలువద్రొక్కుకోవాలని ప్రయత్నిస్తుంది. ప్రస్తుతం పరిస్థితులు మాకు అనుకూలంగా వున్నాయనడానికి వీలులేదు. కాని భవిష్యత్తు మాత్రం ప్రజాపార్టీకి అభిముఖమైవుంది.

## సోషలిస్టు పార్టీ

అఖిలభారత సోషలిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి తమ పార్టీ ఆశయాలను ఇట్లు వివరించినారు.

దేశంలో తలఎత్తుతున్న అన్ని సమస్యలకు మూల కారణాలు ఆర్థికమైనవి. సామాజికమైనవి అని సోషలిస్టుపార్టీ భావిస్తున్నది. ఇంగ్లీషువాళ్ళు మన దేశాన్ని పాలించిన వంద, వందాఏభై ఏళ్ళలోను మన జనాభా రెట్టింపుకు రెట్టింపుగా పెరిగింది. కాని దానితో పాటు ఆర్థిక సంపద పెరగలేదు సరిగదా, ఆ వంద ఏభై సంవత్సరాల క్రిందట ఎక్కడవుందో, ఇప్పుడు గూడా దేశం ఆర్థికంగా అక్కడేవుంది. ఇప్పుడు గూడా పరిస్థితి అందుకు భిన్నంగా ఏమీలేదు. జనాభా సాలుకు 50 లక్షల చొప్పున పెరిగిపోతున్నది. ఆర్థిక సంపదలో పెరుగుదల ఏమీ లేని కారణంవల్ల అంత మేరకు దేశం దరిద్రమయిపోతున్నది. అందువల్లనే ముందు దేశంలో ఆర్థికాభివృద్ధికి అనువైన పనులన్నీ జరగాలని సోషలిస్టుపార్టీ వాదిస్తున్నది. మరి యీ అభివృద్ధికి అడ్డువచ్చే విషయాలు యెన్నో దేశంలో ఉన్నాయి. (1) జనాభా పెరుగుదల. (2) పెట్టుబడి కొరత. (3) శతాబ్దాల తరబడి చలనంఅంటూ లేనందువల్ల సమాజాన్ని ఆవేశించివున్న జడభావం. ఇవన్నీ అట్టి అవరోధాలక్రింద జమ కట్టబడవలసినవే.

దేశంలో వస్తూత్పత్తి పెరగదు; హెచ్చుతగ్గులు రూపుమాయవు; అర్థసంభృత విధానం మొక్కపోదు. దారిద్ర్యంతొలగదు. జాత్యభివృద్ధికి అనుకూలమైన వాతావరణం ఏర్పడదు ఈ మార్పులు అవసరమని కాంగ్రెసు వారుగాని, కమ్యూనిస్టులుగాని భావించడంలేదు. సోషలిస్టులు మాత్రమే కావాలంటూన్నారు. ఎందుకు ? ఆటి మార్పులవల్ల కలిగే లాభాలేమిటో వివరిస్తాను; అప్పుడు ఆ మార్పులెందుకో మీకే తెలుస్తుంది.

ఆర్థిక సామాజికరంగాల్లో ప్రజ ఎట్టి ఉత్తేజం కల్గాలని కోరుతున్నదో; అట్టి ఉత్తేజమే పరిపాలనా విషయములోగూడా వారికి కల్గాలని వాంఛిస్తున్నది. పంచాయతీలు, సాంఘికపరిషత్తులు, సహకార సంఘాలు, లోకసమితులు, ఈ విధంగా పరిపాలనా యంత్రాంగం అంతా ప్రజాయత్తం చేయబడుతుంది. సోషలిస్టు ప్రజాస్వామ్యానికి గ్రామ పంచాయితీలు పునాదులు. జనపద పరిపాలనా వ్యవహారం అంతా ఈ పంచాయతీలమీదనే వుంటుంది. ప్రభుత్వం తరఫున కొంతమంది ప్రతినిధులు, ఈ పంచాయతీలలో ప్రజాప్రతినిధులతో చేదోడువాదోడుగా పనిచేసూ వుంటారు. దేశంలో వర్తకంఅంతా సహకారసంఘాల ద్వారా జరగవలసివుంటుంది. ప్రభుత్వవ్యాపార వ్యవస్థలకు, పారిశ్రామిక వ్యవస్థలకు, ఈ సహకార వాణిజ్య వ్యవస్థలకు మధ్య అనుసంధానం ఏర్పాటు చేయాలి. పరిశ్రమలు సమాజాయత్తం చేయబడిన అనంతరము స్వయంపాలిత వ్యవస్థలుగా రూపొందించబడి, నాటి యాజమాన్యాల కార్మికులకు, సాంకేతిక నిపుణులకు, ఇతర వుద్యోగులకు తగిన ప్రాతినిధ్యం సమకూర్చబడుతుంది. అల్ప పారిశ్రామికులను, దళారీలను సోషలిస్టులు త్రోసిపారెయ్యరు. ఏ పరిశ్రమలు సమాజాయత్తం చేయబడవో, ఆ పరిశ్రమలను సోషలిస్టు ప్రభుత్వం పోషిస్తుంది. చిల్లరవ్యాపారంలో వ్యష్టి వ్యాపారులకు స్థానం వుంటుంది. ఈ విధంగా సోషలిస్టు కార్యక్రమం ప్రభుత్వం అజ్మాయిషీకి, వ్యష్టివ్యాపారానికి, కేంద్రీయ సంధానానికి వికేంద్రీకరణానికి సరియైన మధ్యేమార్గంలో వుండి, పరిపుష్టంగా వుండేవిధంగా సంతరించబడింది.

వస్తూత్పత్తి వ్యవహారంలో ఉత్పత్తిసాధనలకు, జనసామాన్యానికి మధ్యవున్న అడ్డంకులను కనిష ప్రమాణానికి తగ్గించినప్పుడే, అది విశృంఖలంగా కొనసాగుతుంది. ఇట్టిపని జరగాలంటే ముందుగా భూదాన కార్యక్రమం అమలు జరగాలి. అందువల్లనే 30 ఎకరాలకు తక్కువ కాకుండా, 100 ఎకరాలకు మించకుండా, ఈ పునర్భూదాన కార్యక్రమం కొనసాగాలని సోషలిస్టుపార్టీ కోరుతున్నది. పరిహారంతో నిమిత్తం లేకుండా యిదంతా జరగాలి. ఈ భూదాన కార్యక్రమంతోపాటు పంచాయతీలను, సహకార సంఘాలను నిర్మించుకుంటూపోతే, ఈ కార్యక్రమంలో అల్పలోపాలు ఏమున్నా తలయెత్తితే. అవి సర్దుబాటు చేసుకూవుంటాయి, ఇక ఆర్థిక సమానత్వం మాట వుంది. సమానత్వాన్ని కాకపోయినా, దాని దాపులోకన్నా దేశం రావాలి. అంటే, ఆదాయాలకు గరిష్ట కనిష్ట, ప్రమాణాలను నిర్ణయించి తీరాలి. అందుకు 1:10 నిష్పత్తి ప్రస్తుతానికి ఉచితమేగాక, అవశ్యం సాధింపబడవలసి వున్నదనికూడా సోషలిస్టులు భావిస్తున్నారు. అందుకే పెట్టుబడిపన్ను అవసరమౌతుంది. మరి యీ పన్ను 5 లక్షలకుపైనవున్న ఆదాయంమీదే గాని, అంతకంటతక్కువ ఆదాయంమీద విధించబడదు గూడా. ఈ పన్నులవల్లవచ్చే ఆదాయంవల్ల ఆర్థిక పారిశ్రామిక వ్యవస్థలను సమాజాయత్తం చేయడం గూడా సులభసాధ్యం అవుతుంది. అప్పుడు యీ వ్యవస్థల యాజమాన్యం ఏఒక్కరి చేతులలోనోగాక, ఆ వ్యవ

స్థలో పనిచేసే, అన్నిరకాల వుద్యోగులయొక్క ప్రతినిధుల పరంగా కొనసాగుతుంది.

### కమ్యూనిస్టు పార్టీ

కామ్రేడ్ డాంగే కమ్యూనిస్టు పార్టీ వ్యవహారం ఏమిటో చెబుతారు.

మనదేశం ఎదుర్కొంటున్న సమస్యల్లో ముఖ్య సమస్య ఆహార సమస్య. కాంగ్రెస్ వాళ్లు గనుక భూస్వాములను అధికారంలో కూర్చోపెట్టక పోయినట్లయితే ఈ సమస్య తేలిగ్గా పరిష్కారం అయివుండేది. స్వరాజ్య ప్రభుత్వం ఏర్పడగానే, ప్రభుత్వం గనుక రైతులను భూముల్లోంచి తొలగించడం మాన్పించి, భూస్వాములు కవుళ్లను వసూలు చేయడాన్ని, అధమర్ణులు వడ్డీని వసూలు చేయడాన్ని నిషేధించి, ఆహార ధాన్యాల సరఫరాను రైతు సంఘాల పరం చేసి వున్నట్లయితే ఈ ఆహార సమస్య తేలిగ్గానూ తేలిపోయేది; మన దేశాన్ని అమెరికా వాళ్లకు కుదువపెట వలసిన అవసరమూ కలుగకపోయేది.

అట్లాగే పారిశ్రామిక సమస్యల విషయంలో గూడాను. కార్మికుల కనీసపు కోర్కెలను గౌరవించి, వారియొక్క, ఇతర తక్కువ జీతగాళ్ల యొక్క వేతనాలను పెంచి, కార్మిక సంఘాలకు ఈ అన్ని వ్యవహారాలలో ప్రాతినిధ్యం ఇచ్చి వున్నట్లయితే, ధరల సమస్య, వేతనాల సమస్య, అఖరికి బ్లాక్ మార్కెట్ సమస్య ఎంతో బాగా తీరిపోయి వుండేవి. ఆంగ్లో-అమెరికన్ మండలంతో వ్యాపార సంబంధాలను తెంచుకొని వుంటే, ముడి పదార్థాలకు సమస్యగాని పెట్టుబడి సరకుల సమస్యగాని తలఎత్తి వుండేదికాదు. బ్రిటిషువాళ్లు మనకు యంత్రాలు ఇవ్వమంటున్నారు. ఇండియాలో వున్న వారి వ్యాపార పారిశ్రామిక వ్యవస్థలను వశపరచుకుంటే ఈ సమస్య తేలిగ్గా తీరిపోయేది. పెట్టుబడి విషయంలో గూడా అంతే. భూస్వాములు పుచ్చుకొనే కవుళ్లను అధమర్ణులు తీసుకొనే వడ్డీని స్థంభింప జేసి, కార్మికుల కోర్కెలనన్నింటిని సవ్యంగా తీర్చి, పరిశ్రమలను గుత్తేదారుల చేతుల్లోంచి రక్షించి, వారి చేతుల్లోకి కోటకోట్లు పోతూ వున్న డబ్బును ప్రజాపరంగా సమకూర్చుకొని వున్నట్లయితే, పెట్టుబడి లేదో అని గోలపడ నవసరమే లేదు. ఆంగ్లో-అమెరికన్ మండలాన్ని కాళ్లవేళ్లాపడ బ్రతిమాల నవసరం లేదు. ఈ ఆంగ్లో-అమెరికన్‌లకు మనం బలపడటం ఎప్పుడూ ఇష్టంలేదు. మనం వారికి ఒక వలస రాజ్యంగా తయారు కావాలని వారు ఆశిస్తూ వుంటారు. అయితే ఇదంతా ఇట్లా చేస్తే దేశం బాగుపడుతుందని నెహ్రూకు, ఇతర కాంగ్రెసువాదులకు తెలియదను కుంటారేమో! తెలుసు. తెలిసే తమకు అధమర్ణులతోను, భూస్వాములతోను వున్న సావాసాన్ని సరిపెట్టలేక, చేతులు ముడుచుకూర్చుంటున్నారు. అందువల్లనే కాంగ్రెసును పదభ్రష్టం చేయాలని నేను చెబుతున్నది గూడా. మరి కాంగ్రెస్సు ప్రభుత్వాలు ఏదో పెద్ద ప్రజాస్వామ్య ధర్మవిహిత మని చెబుతున్న రాజ్యాంగాన్ని సరిగ్గా అనుసరిస్తూ కాల్పులకు, అకృత్యాలకు, మిలిటరీ పరిపాలనకు, రాజ్యాంగ విరుద్ధమైన ధర్నాలకు దిగకుండా వుంటే, కమ్యూనిస్టుపార్టీ ఈ రాజ్యాంగాన్ని ఒక పరీక్షకు నిలువదలచుకుంది. కమ్యూనిస్టుపార్టీ ఎప్పుడూగూడా శాసనాలు గనుక సరిగ్గావుంటే ప్రజలను శాసన ధిక్కారానికి పురిగొల్పదు. అటి విరుద్ధ శాసనాలు అమలు జరిగినప్పుడు ప్రజలే, తగిన సమాధానం ఇస్తారు అంతేగాని, కమ్యూనిస్టుపార్టీకి 'టెరరిజం'లో నమ్మకం ఎప్పుడూలేదు. అఖరికి తెలంగాణాలో గూడా కమ్యూనిస్టులు ఎన్నడుగాని దౌర్జన్యానికి దిగలేదు. ప్రజలే భూస్వాములకు ఎదురు తిరిగి భూములను వశంచేసుకొని, భూస్వాములు, ప్రభుత్వం తమ మీదకు వచ్చేసరికి వారిపని పట్టించాలని ప్రయత్నించారు. అంతేగాక కమ్యూనిస్టులకేమీ సంబంధంలేదు. మరి అదంతా గూడా ఆత్మరక్షణకోసం జరిగిందే. ఇప్పుడు ఈ పరిపాలకులు ఎన్నికలు అంటూ పెట్టి, రాజ్యాంగాన్ని అనుసరించి, భూమిసమస్యను పరిష్కరించుకుండా వుంటున్నారు. మీ ఇష్టంవచ్చిన ప్రభుత్వాన్ని ఎంచుకొని, ఈ సమస్యలను తీర్చుకో వచ్చు నంటున్నారు. అయితే సరే, అదీ చూద్దాం అని కమ్యూనిస్టుపార్టీ అంది.

కమ్యూనిస్టు పార్టీ వెంటనే భాషాప్రయుక్త రాష్ట్రాలను నిర్మించాలం టుంది. ఆడవాళ్లకి, షెడ్యూల్డు తరగతుల వారికి స్వాతంత్ర్యం కావాలని అంటుంది. ఈ ఆశయాలతో కమ్యూనిస్టుపార్టీ మరికొన్ని చిల్లర వామపక్షాలను కలుపుకొని ఒక ఫ్రంటును పెట్టి ఎన్నికల్లో పాల్గొంటున్నది. ఎన్నికల్లో నెగ్గిన కమ్యూనిస్టు ఫ్రంటు అభ్యర్థులు, శాంతి స్వాతంత్ర్యాల కోసం పోరాటం సాగిస్తున్నారు.

### నిమ్నజాతి ఫెడరేషన్ :

ఇక డా|| అంబేడ్కర్ గారి పార్టీ వుంది. అది షెడ్యూల్డు తరగతుల ఫెడరేషన్ ఆయన ఆ పార్టీ కార్యక్రమం ఏమిటో విశదం చేసిరి. ఈయన సోషలిష్టులతో గూడా పొత్తు కుదుర్చుకున్నారు. అది

ఎందుకు చేసారో గూడా తెలియజెప్పకున్నారు.

మన దేశానికి నిజానికి ప్రజాస్వామ్యం అంటే ఏమిటో తెలియదు. అయినా ఆ ప్రజాస్వామ్య ధర్మాన్ని అనుసరించి ఎన్నికలు పెట్టి దేశంలో ప్రభుత్వాన్ని ఎన్నుకోండయ్యా అని ప్రజలను కోరాం. అట్టి కోరిన సందర్భంలో ప్రజలు ముఖ్యంగా ఓటు చేసే హక్కు వున్నవాళ్ళు ఒక్క ప్రశ్నంటే ఒక్కటే ప్రశ్న వేసుకోవాలి. ఫలానా పార్టీ ఏ సిద్ధాంతాల కోసం వుంది? ముఖ్యంగా కాంగ్రెసును గూర్చి ఇట్టి ప్రశ్న ప్రతి ఒక్కరు వేసుకొని విచారించాలి. ఈ ప్రశ్న నన్ను నేనుగూడా వేసుకున్నాను. అందుకు ప్రత్యుత్తరం గూడా చెప్తున్నాను. ఆ ప్రత్యుత్తరం ఇది. కాంగ్రెసు ఒక ధర్మశాలను పోలివుంది. అదో పెద్దసత్రం. దానికి సిద్ధాంతాలు అవ్వీ ఏమీ లేవు ఎందుకు పనికిరాని వాళ్ళదగ్గర నుంచి మహారాజుల దాకా అందులో వున్నారు. మతదురహం కారులు, ఆధిపాతిక వాదులు, పెట్టుబడి దార్లు, వారి విరోధులు, ఒక విధంగా గుర్రాలకు, గాడిదలకు అన్నింటికీ అందులో స్థానం వుంది. అందువలనే అది ఈ నాల్గు సంవత్సరాల్లోను ఏమీ చేయలేకపోయింది. అదిగాక కాంగ్రెసు నెమ్మది నెమ్మదిగా రూపరి పోతున్నది ఎప్పుడో ఒకరోజున అయిపు ఆనమాలు లేకుండా పోతుంది. అందువల అది చేయగలిందేమీ వుండదు. ఒకవేళ ఏమన్నా చేసినా, అది కంపుకొట్టి పోతూవుంటుంది.

మరి షెడ్యూల్డు తరగతుల ఫెడరేషన్ అట్లా కాదు. దానికి కొన్ని సిద్ధాంతాలు వున్నాయి. అవి యివి.

(1) దేశీయు లందరు సమానులు అని చెప్పి వూరుకోక, అట్టి సమానత్వాన్ని సాధించడానికి, అది ఎచ్చట కొరవడి వుందో, అచ్చట అది సిద్ధమయ్యేటట్లు చేయడం. (2) ప్రతి పౌరుడికి తన అభినివేశాన్ని బట్టి అభివృద్ధిలోకి వచ్చే అవకాశాన్ని కల్పించడమే ధ్యేయంగా పెట్టుకొని, అందుకు రాజ్యం యొక్క ఉనికి ఒక ఉపాదేయంగా వుండేటట్లు సంతరించడం. (3) భారతదేశంలో అందరికి ఆర్థిక మత రాజకీయ స్వాతంత్ర్యం వున్నదని గుర్తించి, ఆ స్వాతంత్ర్యం ఇతర భాగస్థుల అభివృద్ధికి, రాజ్యం సుస్థితికి అడ్డు రాకుండా దాన్ని అవసర మైనంత మేరకు నియమిస్తూ వుండటం. (4) భారతీయుడైన ప్రతి ఒక్కనికి సమానావకాశాలు లభ్యం అయ్యేటట్లూ చూస్తూ, ఇంతవరకు వాటిముఖం ఏమిటో ఎరుగని వారికి ప్రాధాన్యం యిచ్చి పోషించడం. (5) భారతదేశంలో అన్నాతురత, భయోత్పాతం అన్నవి లేకుండా చూడటం ప్రభుత్వాల బాధ్యతగా పరిగణించడం. (6) స్వాతంత్ర్యం సమానత్వం, సౌభ్రాతృత్వం ఇవి ఆశయాలుగా, ఒక మనుష్యుని మరో మనుష్యుడు దోచుకొనే వీలు లేకుండా చూస్తూ, ఒక దేశాన్ని ఇంకో దేశం దోచుకోకుండా చేస్తూ వుండటం. 7) పార్లమెంటరీ పద్ధతి ప్రభుత్వ ధర్మాన్ని గౌరవించడం.

ఒక పార్టీకి ఇవి సిద్ధాంతాలు అని చెబితే చాలదు. దాని విధానాలు ఏమిటో గూడా తెలియాలి. ఫెడరేషన్ విధానాలు ఇవి: (1) ఫెడరేషన్‌కు దౌర్జన్యంలో విశ్వాసం లేదు. (2) ఫెడరేషన్‌కు నియంతృత్వంలో నమ్మకం లేదు. (3) రాజ్యం ఒక లక్ష్యం వ్యక్తి ఒక సాధనం అని ఫెడరేషన్ విశ్వసించడం లేదు సరిగదా, ఫెడరేషన్ వ్యక్తి అభివృద్ధి లక్ష్యం. రాజ్యం అందుకు సాధనం అని నమ్ముతుంది. (4) ఫెడరేషన్‌కు ఏ 'ఇజం' తోనూ సంబంధం లేదు ఏపద్ధతి వల్ల దేశానికి మేలు జరిగితే ఆ పద్ధతిని సూచన వివరించిన పద్ధతులను లాంగి అనుసరించడం ఫెడరేషన్ ఆశయం.

దేశాన్ని యెదుర్కొంటున్న సమస్యలు ఈ విధంగా వున్నాయని ఫెడరేషన్ అభిప్రాయం. (1) వెనుక పడివున్న జాతులను ఉద్ధరించడం (వెనుక పడివున్న జాతులంటే షెడ్యూల్డు తరగతులు, క్రిమినల్ జాతులు, ఇతర బడుగు తెగలు-అవి) (2) జనాభాను అరికట్టడం ద్వారాను, వస్తూత్పత్తిని అధికం చేయడం ద్వారాను దారిద్ర్యాన్ని నిర్మూలించడం. (3) నీటి పారుదల సౌకర్యాలు. విద్యుదుత్పత్తి, అటవీ సంపద పెంపు, కొత్త భూముల సాగు, వీటికి ప్రాధాన్యత ఇస్తూ, దేశంలో సర్వ సంపదలను పెంపొందించడానికి పథకాలు. (9) దేశం యొక్క ప్రయోజనాలకు ఉపకారంగా పరిణమించే విదేశాంగ విధానం: ఫెడరేషన్ విదేశాంగ విధానం ఇట్టిదిగా వుంటుంది గాని, ఆసియాకు నాయకత్వ సంపాదించడం కోసంగా వుండదు.

ఫెడరేషను ఆర్థిక విధానం గూడా వాస్తవికంగా వుంటుంది. అది ఇది (1) రక్షణ వ్యయాన్ని 30 కోట్ల రూపాయలకు పరిమితం చేయుట. (2) ఉప్పు పన్ను వేసి, 30 కోట్ల ఆదాయాన్ని అదనంగా సమకూర్చడం. (3) భీమా కంపెనీలను జాతిపరం చేసి, ప్రభుత్వోద్యోగులంతా విధిగా భీమా చెయ్యాలని విధించి,

అందువలన ఏర్పడిన భీమా నిధిని దేశాభివృద్ధి కార్యక్రమాలకు వినియోగించడం; అభివృద్ధి కార్యక్రమాల కోసం విదేశాల పెట్టుబడి మీద ఆధారపడి లేదని పెడరేషన్ భావం. అందువల్ల ఇప్పుడు మేం వివరించిన మార్గం కన్నా వేరుమార్గం ద్రవ్యసమపార్టీనకు అనుకూలించి లేదు. నిజానికి పెడరేషన్ ఆర్థిక విధానమే వ్యక్తమైన ఆర్థిక విధాన -

ఆచార్య రంగా ఈ మధ్య ఒక పార్టీని పెట్టారు. దానిపేరు కృషి కార్ లోక్ పార్టీ ఆ పార్టీ కార్యక్రమం ఏమిటో ఆయన వివరించినారు.

ఈ కృషికార్ లోక్ పార్టీ కిసాన్లు, మజ్దూర్లు, కళాకారులు- వీరి పార్టీ, సమాజంలో వీరు కాని ఇతరులు అధికారాన్ని చేజిక్కించుకొని శతాబ్దాల తరబడగా వీరిని అణచుతూవచ్చారు. వీరియొక్క కృషి ధర్మాన్ని తృణీకరిస్తూ, ఇతరమైన వాటి నన్నింటినీ గౌరవిస్తూ వచ్చారు. వీరికి సరియైన విద్య లభ్యం అయ్యేటట్లు చేయక వీరి మనస్సులను చైనా చెప్పు సామెతగా కుదించివేసారు. అందువల్ల వీరికి సామాజికంగాను, ఆర్థికంగాను, రాజకీయంగాను వున్న ఇబ్బందులను తొలగించి. స్వాతంత్ర్య బలం సాక్షాత్కారం అయ్యేటట్లు చేయడమే ఈ పార్టీ ఆశయం.

ఒక్కమాటలో వీరి నందరిని కిసాన్ ప్రజ అంటే నాలు. మరి శబ్దం యొక్క అర్థం 400 లక్షల హరిజనులకు, 20 లక్షల బడుగు తరగతులకు, 200 లక్షల షెడ్యూల్డు తరగతులకు, 100 లక్షల చేతి సేవ పని వాండ్రకు గూడా అనువర్తిస్తుంది. కాలక్రమవశాత వీరంతా ఒక్కదారిని పోని కారణంచేత, పెట్టుబడిదార్లు, పారిశ్రామికులు వీరిని తాము సంపన్నులవడం కోసం వినియోగించుకొంటున్నారు. అందువల్ల కృషి కార్ లోక్ పార్టీ ఆ రెండు తరగతుల జనాన్ని పరిశోధించి, కిసాన్ జనం యొక్క సామాజిక ప్రయోజనాన్ని పెంపొందించడానికి ప్రయత్నము చేస్తుంది. మరి ఇది పారిశ్రామిక వస్తు నిచయాని వ్యావసాయిక వస్తు నిశ్చయాని సమానమయిన ధరను ఏర్పాటు చేసి నాడే సాధ్యం అవుతుంది. అప్పుడే గ్రామీణ ప్రజ, పట్టణ ప్రజతో సమానులం అని అనుకోగల్గుతారు.

భూమి దున్నే నాడు అని వినగానే, దానికి సరియైన అర్థం ఏమిటో చాలా మందికి బోధపడకుండా వుంది. వ్యవసాయంలో ఏదో ఒక గౌణమైన పనిచేసి, తాముగూడా సేద్యగాండ్రమే అని అనుకున్నా అనుకునేవాళ్లు వున్నారు. కాని, రైతులు, భూకామందులు మాత్రమే నిజానికి పాలుపొందుగునా ఈ సేద్యంలో వుంటారు. ప్రతి సంవత్సరం వారి కదే పని. అందువల్ల ఇట్టివారినే నిజమైన రైతులనుగా, అంటే భూమిదున్నే వాళ్ళనుగా భావించాలి. వ్యవసాయంలో కృషిచేసే వారికి, ఆ కృషియొక్క ఫలితం దక్కాలి. వారిభూమిమీద వారికి వుండుకున్న హక్కును, పరిహారం ఇచ్చిగాని తీసివేసేందుకు వీలు లేదు.

దేశంలో భూమికావాలనేవాళ్ళు చాలా మంది వున్నారు. అందుకు ప్రభుత్వం వెంటనే అట్టిభూమిని సముపార్జించడానికి గట్టిప్రయత్నం చేయాలి. పనికిరాని అడవులను కొట్టివేసి; బంజరుభూములను, మోడ భూములను సాగులోకి తెచ్చి, పెద్ద భూస్వాములు సేద్యంలేకపోతే; వారి భూములను సాధించి, ఈభూమి ఆకలి తీర్చాలి.

వ్యావసాయిక సమాజంలో సహకారసంఘాలకు కుటీరపరిశ్రమలకు ప్రముఖస్థానం వుంటుంది. వీటిని పెంపొందించడం ద్వారానే కళాకార్ జనంలో ప్రబలివున్న నిర్వ్యాపారత్వం తొలగిపోతుంది. జాతీయాభివృద్ధికి ఎట్టి పథకాన్ని తయారుచేసినా, ఈ కళాకార్ జనానికి ప్రాధాన్యం లభించేలాగున దాన్ని తయారు చేయాలి. ఎందుచేతనంటే ప్రభుత్వాలు ఇంత కాలంగా తమ్ము అనాదరంగా చూచినా, వారు మాత్రం తమ కళలను వదులుకొనక, వాటినే నమ్ముకొని జీవిస్తూవచ్చారు. అందువల్ల కృషికార్ లోక్ పార్టీ కుటీర పరిశ్రమలను పెంపొందించడమేగాక, లక్షలాది కళాకారులు నూతన సమాజ నిర్మాతలు, అధినేతలు అయ్యేటట్లుగా వారిని సంధానపరుస్తుంది.

రైతాంగాన్ని తీసుకుంటే, వారి జీవనప్రమాణం ఎక్కడో మిణుకు మిణుకుమంటూ వుంది. ఇప్పుడు అది పెంచేటట్లు చూడాలి. కర్షకజనం, కార్మికజనం వచ్చే సంవత్సరాలలోను ఉత్పత్తి ఇప్పటికన్నా 25% పెంపు వహించేటట్లు ప్రభుత్వం చూడకపోతే ఈ ప్రమాణం హెచ్చదు. అందుకు ప్రభుత్వం యేమి చేయాలి? కృషికార్ లోక్ పార్టీ ఈ పనులు చేయాలంటుంది: (1) రైతులకు వారిపంటలకు తగిన ధరలు లభ్యంఅయ్యేటట్లు చూచి, ఖర్చులుపోగా వారికి బాగా మిగులు వుండేటట్లు చూడాలి. వ్యవసాయకూలీలకు మంచి వేతనాలు లభించి వారి జీవితాలు బాగుపడాలన్న, ఈ ధరలను పెంచవలసిన అవసరం కన్పిస్తుంది. రవాణా, నీటిపారుదల సౌకర్యాలు, ఋణ ప్రధాన

సంఘాలు, బ్యాంకులు, ఫ్యాక్టరీలు, రైల్వేలు, ఈ మొదలైన శిలక కృషులమీద, పెట్టుబడిదారీతనం ఎక్కువై పోవడమేగాక, ప్రభుత్వంగూడా ఈ పెట్టుబడిదారులకే అండగా వుండటం జరుగుతున్నది. రైతుజనం బాగుపడాలంటే, ఈ పెట్టుబడిదారీతనం తొలగి, ఈ కృషులన్నీ ప్రజలకు సేవచేసేవిగా తయారయ్యేటట్లు చూడాలి. (2) దేశంలో విద్యావిధానం రైతాంగానికి అనుకూలమైందిగా లేదు. ఈ విద్య చదివిన రైతుబిడ్డలు భూములకు దూరమైపోతున్నారు. వ్యవసాయ అభినివేశం చస్తున్నది. అందువల్ల దేశంలో వ్యవసాయ కళాశాలలు, పోలీ టెక్నిక్‌లు, జానపద పాఠశాలలు రైతాంగ విద్యావ్యవస్థలు. ప్రయోగక్షేత్రాలు, కుటీర పారిశ్రామిక స్థానాలు, మూల విద్యాశాలలు, కాలేజీలు ఎక్కువగా నెలకొల్పవలసి వున్నది. అందువల్లనే గ్రామీణ విద్యావిధాన పద్ధతులు త్వరగా మారాలని కృషికార్ లోక్ పార్టీ కోరుతున్నది. (4) ఇంకో విషయమేమిటంటే, ఆధునిక విజ్ఞానశాస్త్ర విజ్ఞానం కృషికార్ జనానికి ప్రయోజనకారిగా పరిణమించేటట్లు చూడాలి. వ్యవసాయాభివృద్ధికి శాస్త్రవిజ్ఞాన దోహదమిస్తుందని తెలియజెప్పి, రైతాంగజనం ఆ పద్ధతులను అనుసరించేటట్లుచూడాలి. (5) పంటల అభివృద్ధికి ఎంతప్రాముఖ్యం యిస్తున్నామో, అంతటి ప్రాముఖ్యమున్నా పశుసంపదయొక్క అభివృద్ధికి, గోసంరక్షణకు ఇవ్వాలి. (6) మనదేశంలో రైతాంగ యింత హీనంగా వుండిపోవడానికి కారణం, మన జాతీయ ఆవరణమే అని కృషికార్ లోక్ పార్టీ విశ్వాసం. ఉత్పత్తిపద్ధతులు మారని కారణంచేతనే. ఈ ఆవరణం ఇట్లా వుంటుంది. కాబట్టి యీ ఆవరణను మార్చవలసిన అవసరం వున్నదని మా పార్టీ కోరుతున్నది. అందుకు ఉత్పత్తి పరికరాలను, పద్ధతులను పూర్తిగా మార్చుకుంటూ రావాలి. అయితే ఈ పని అంతా జరగాలంటే మన దేశంలో లభ్యమౌతున్న పెట్టుబడి చాలదు. అందువల్ల విదేశాలనుంచి పెట్టుబడి సహాయాన్ని పొందాలి. ఈ విషయంలో కృషికార్ లోక్ పార్టీ జాతీయ ప్రణాళికా సంఘంతో ఏకీభవిస్తుంది.

భారతదేశం శ్రేయోరాజ్యంగా పెంపొందాలనే కృషికార్ లోక్ పార్టీ ఆశయం. మరి ఆ లక్ష్యాన్ని సాధించాలంటే టోటలిటేరియన్ శక్తులను, పార్టీలను, అదుపులో వుంచాలి. మిశ్రమ ఆర్థికపద్ధతులద్వారా పబ్లిక్ కార్పొరేషనులద్వారా, ప్రభుత్వ వ్యాపార వ్యవస్థలద్వారానే అట్టి రాజ్యస్థాపన సుసాధ్యం అవుతుంది. కాని అన్నివిధాలా వెనకబడివున్న మనదేశంలో ఇవన్నీ సమకూరడం అంత తేలిక కాదు గనుక, కార్మికులకు, యజమానులకు, ఇతర కృషులకు మధ్య భాగస్వామ్య పద్ధతిని సయోధ్యతను, సహకారాన్ని సమకూర్చడంద్వారానే, ఈ రాజ్యాన్ని సాధించవలసి వుంటుందని కృషికార్ లోక్ పార్టీ విశ్వసిస్తున్నది. వర్తకులకు, పారిశ్రామికులకు, పబ్లిక్ కార్పొరేషన్లకు, ప్రభుత్వ వ్యాపార వ్యవస్థలకు ఎక్కువ స్వాతంత్ర్యాన్ని ఇచ్చి, పోషించాలని మా పార్టీ కోరుతున్నది.

ప్రత్యేకమైన అభివృద్ధి బోర్డులద్వారా వెనకబడివున్న ప్రాంతాలను అభివృద్ధిలోకి తీసుకరావడం, దేశాన్ని భాషాధారకంగా విభజించడం స్త్రీలకు పురుషులతోపాటు అన్ని విషయాలలోను సమానహక్కులను ప్రసాదించడం ఈ మా పార్టీ ఆశయాలు. సైనికవిద్యాలయాలలో భూస్వాములైనవారికి, పెట్టుబడిదార్లయినవారికి లభించినన్ని అవకాశాలు ఇతర ప్రజలకు లభించడంలేదు. ఇట్టి పద్ధతి రద్దుకావాలని, కొంతశాతం సైన్యంలో పనిచేస్తున్న వారి నిమిత్తం సైనిక ఉద్యోగాలు కేటాయించి, సమస్త సైనిక జనానికి దేశరక్షణలో మంచి అభినివేశం పెంపొందేటట్లు గూడా చూడాలి. ప్రభుత్వోద్యోగాల గూడా బంధుప్రియత్వం, కుల విచక్షణ [illegible] మొదలైన పద్ధతులు తొలగించేందుకు ఈ పార్టీ కృషిచేస్తుంది. దేశవిభజనవల్ల పాకిస్తాన్‌నుంచి మన దేశానికి వచ్చిన కాందిశీకుల ఎంతోమంది ఎన్నో కృషుల నైపుణ్యం గడించుకున్నవారు వున్నారు. వీరిని సరిగ్గా ప్రభుత్వం వినియోగించుకొనగలిగితే దేశం ఎంతో బాగుపడుతుంది. కృషికార్ లోక్ పార్టీ ఇట్టి వారందరికీ తగిన దోహదం ఇచ్చి, వారికి పునరావాస సౌకర్యాలు కల్పించి వారంతా భారతదేశం నిర్మించ తగిన వారయ్యేటట్లు చూడాలని ఆశిస్తున్నది. షెడ్యూల్డు జాతులు, షెడ్యూల్డు తెగలు, ఈ ప్రజలకు ముఖ్యంగా మంచి నీటి వసతులు, ఇళ్ళు అవసరంగా కన్పిస్తున్నాయి.

ఇందుకు కృ. లో. పా. భారత సేవాసంఘం వారితో కలిసి, సర్వోదయ కార్యక్రమాన్ని అమలు జరిపేందుకు పని చేస్తుంది.

పట్టణాల గృహసమస్య పరిష్కరించడానికి, అయితే ప్రభుత్వం ఎన్నో పథకాలు వేసింది. కాని ఈ గృహసమస్య జనపదాలలో ఎక్కువగా వున్నది. ప్రభుత్వం అక్కడి ఈ సమస్యను పరిష్కరించడానికి పూనుకోవాలని కృ. లో. పా. కోరుతున్నది. జన

( తరువాయి 12వ పేజీలో )

# దంపుడు పాట

శ్రీ ప్రసాద్

మన దేశమున వడ్లు, జొన్నలు, సజ్జలు, కొఱ్ఱలు, ఆరికెలు, ఆహారమునకుపయోగ పడుధాన్యము దంచి పొట్టుదీసి పోటువేసి వండుకునేవారు. పల్లెలలో ధాన్యమును ప్రతి రోజు ప్రతి యింటా దంపుడు చేయుచుందురు. దంపుడు సమయమున రోకలిని కుడి యెడమ చేతిలో అందుకొని దంచుచుందురు. దంచునపుడు స్త్రీలు రోకటికి చేరువనిలబడి పైటకొంగు వక్షమునకు. కప్పు అలంకారము గా దోపుకొనట్లు నడుము వంగించి ఒక కాలు ముందు ఒక కాలు వెనుక వేయుంచి మోకరించి పూనిపోటు వేయుచుందురు. ఊపి వదలుచు పీల్చునపుడు యలసటగాను ఉ మూల్గుచుందురు. ఆమూల్గులోనే పల్లెపాట గూడ వారిని డింపు మాలుపడును. ఆ పాట యందు బొమ్మడుపరుపబడినది. ఒకే రోటి దగ్గర ముగ్గురు నలుగురు స్త్రీలు వరుసగా చెప్పుకొనుచు పాటకు లయగలయునట్లు దంచుచుందురు. కొంచెము దమ్ములో వరుసదప్పినా రోకలి రోలకుదురుగులులో రోకట్లు కొట్టుకొనుట యోగసంభవించును. అట్టపుడు వెంటనే పాగుట యెగుర్చుకొనును. ఇరుల సవరించుకొని దంచుట ప్రారంభింతురు. ఇట్టి పాట వలన ఊపిరితిత్తులు బాగుపడును. శరీరము చమట బట్టి రక్త ప్రసారమున గట్టిపడును. ఆరోగ్యము అంగసౌష్ఠము ప్రకాశవంతముగా నుండును. రాత్రి పీడకలలు లేక సుఖనిద్ర పట్టును. పరిస్థితము పల్లెటూళ్లలో దంపుడు విధానము సన్నగిల్లుచున్నది. క్షయ, బాలెంతరోగ ప్రదరాదిజాడ్యములు సామాన్య కుటుంబాలలో గూడ ప్రాకిపోవుచున్నవి. హిస్టీరియా హృదయమానసిక జాడ్యములకు దంపుడు పరిశ్రమమంచిది. క్షయ మొదలగు మానసిక జాడ్యములు అంతఃపుర స్త్రీల లోనే యెక్కుడు గానవచ్చుచుండెడివి. అంతఃపుర వాసినుల హస్తములను చిగురుటాకులనుగా కవులు వర్ణించినారు. తామర తూడులనుగా చేతులను వర్ణించినారు. ఈ విధమైన వర్ణనలతో స్త్రీలను అలంకారవస్తువులనగా నుపయోగపరుచుకొని యబలలను గా జేసినారు. అందువలననే స్త్రీలను అబలలందురేమో? దంపుడులో స్త్రీలకున్న నేర్పు పురుషుల కుండదు.

ఈ దంపుడు పద్ధతి దాదాపు ముప్పది సంవత్సరాలమునకు ముందునుండి లోపించి. వడ్లవిసురుడు రాళ్ళు వృద్ధియైనవి. మరయంత్రములు మన దేశమున ప్రవేశించిన నాటగోలె మరబియ్యము వ్యాపకమునకువచ్చినవి. అప్పటినుండి మనశరీర పాటవములు సన్నగిల్లినవి. అన్నములో రుచిలోపించినది. నానారోగములు అజీర్ణములు వృద్ధిగాంచినవి. కోశములకు బలము తగ్గిపోయినది. సరియైన గింజి నిశ్యాయము లేకుండ బోయినది. ఈ దంపుడు మరబియ్యమును గూర్చిన చర్చోపచర్చలు మనము పత్రికలలో నేటికి చూచుచునే యున్నాము. పల్లెటూరి వాసులకు దంపుడు విధానమువలన పనులు తీరిక లేకుండెను నేడు పల్లెటూరి వాసులలో నొకవిధమైన బద్ధకము పాలుమాలికలు పొడసూపినవి. ఆరోగ్య శాస్త్రవేత్తలు తుదకు దంపుడు

విద్యానే మంచిదని తేల్చినారు. భారత దేశమున మనపూర్వులు ఆచరణలో పెట్టిన పద్ధతులలో యెంతో విశిష్టతయున్నదని మనము నేడు అనుభవమున తెలిసికొనుచున్నాము.

## దంపుడు పాట

నందావన్నెలగాచె చంద్రుడుబొడిచె
అమరా, జిలుకలుబలికె అమానుమీద
అమాను కిందానే కుంకుమరోలు.
కుంకుమరోటికి రేరాకుదురు.
రేరాకుదురుకు చెరుకురోకండ్లు.
చెరుకురోకళ్లాంకు చేడెలిద్దారు.
ముత్యాలముసుగొంగు ముందటికిజెక్కి
వగుడాల పరిటకొంగు పక్కవడజెక్కి
కంచుమెట్టెలకాలు జంగవడజాసి
కంకణాలచేత గజమందుకోని
ఉంగురాలచేత ఉసిపోటేసి
పాటపాడి దంచిరి పణతులిద్దరు
పాటలచప్పుడుకు లేచెకృష్ణయ్య
మానుమానున పండు మానిపైపండు
నూతంద్రిడి కృష్ణయ్య, మామిడిపండు.

* * *

కొట్టాన చప్పుడాయె కోడల్లుబెదిరె
నగశ్రీలు గలిగున్న నాటికృష్ణయ్య
నగుతబోయి మనదోడి నడువ కురులిచ్చె
వడివంక లేవమ్మ వల్లభునికురులు
చిక్కన్న బడిలేవు శ్రీరామునికురులు
పాటిమీద పదివేలుపాడావుల మంద
పాలుబిండె పొద్దాయె వెల్లిరావన్న
యేటియొడ్డున యేడువేల యెద్దులమంద
యెద్దులిడిసె పొద్దాయె వెళ్లిరావన్న

* * *

పచ్చడంబు పైకప్పి పాదమునడిదన్ని
పట్టినలేవకమ్మ పణితి మీ వదినె
శృంగార ఫల మిచ్చి కలికనిలేపన్న
కదలించినలేవదమ్మ కలవారిపట్టి
విసనకఱ్ఱలతోడ విసరి లేపన్న
విసరినలేవదమ్మ విరజాజిమొగ్గ
కొబ్బరికుడకతో కొట్టి లేపన్న
కొట్టినలేవదమ్మ కోమ్మమీ వదినె.

* * *

---

( 10వ పేజీ తరువాయి )

పదాల్లో కులానికి ఒక వాడచొప్పున పరివరిలుతున్న పద్ధతిని తొలగించడం అన్నదికూడా ఈ పార్టీ ఆశయము. కాంగ్రెసుహయాంలో జనపదాలలో పన్నుల భారంకూడా ఎక్కువైంది. అది క్రమంగా తగ్గేటట్లు చూడడంకూడా ఈ పార్టీ ఆశయం. ప్రభుత్వోద్యోగాలుకూడా ఎక్కువ ఉద్యోగాలు పట్టణప్రజల వశమే అవుతున్నాయి. ఈ పద్ధతిలోకూడా మార్పు తీసుకరావాలని మా పార్టీ ఆశిస్తున్నది. అసలు అన్నిటికంటె ముఖ్యంగా ప్రజానాయకత్వంలో మార్పు రావాలి. ఇంతవరకు నాయకులైనవారు పైతరగతుల ప్రజలలో చేవస్తూవచ్చారు. అందువల్ల బహుళజనం వారిమీద ఆధారపడి వుండవలసిన అవసరం కలుగుతుంది. కిసాన్ మజ్దూర్ కళా కార్ జనరాజ్యాన్ని స్థాపించాలంటే, ఈ నాయకత్వపద్ధతిని మార్చాలి. రైతాంగ జనం తమ స్వశక్తిని గుర్తించి, తమ బిడ్డలు, అట్టి నాయకత్వం వహించగలట్లుగా వారిని పెంచి శిక్షించి అభివృద్ధిలోకి తీసుకరావలసి వుంది. కృషిక్ కార్ లోక్ పార్టీ ఇట్టి లక్ష్యంతో పనిచేస్తుంది.

# ర భ స

రచన : శ్రీ కోట శ్రీనివాసరావు

ఆ రోజూ నా, నేను ఆఫీసుకు ఆలస్యంగా బయల్దేరాల్సి వచ్చింది. ఆ... ! ఇంటి పరిస్థితుల్లో, అమ్మగారు ఈ చలికాలంలో కావలించుకు పడుకున్న మంచాన్ని ఒదిలి తెల్లవారే పొయ్యి అంటించి, ఓ కాఫీ అనీ పలహారం అనీ తయారుచేసి తొమ్మిదింటికే అన్నం పెట్టి ఆఫీసుకు పంపించటం ... అయ్యో ... రాత. ఎక్కడిమాట. ఆగీత ఈ నాబోటి సంసారంలో ఉన్న సన్యాసికా...? అమ్మగారు లేచేటప్పటికే ఎనిమిది ... ఇంకా, కాఫీ వగైరాలూ అయ్యేటప్పటికి తొమ్మిదింబావు, తొమ్మిదిన్నరా ... ఎత్తేస రెక్కించేటప్పటికీ ... మన చిల్లర పనులు అయ్యేటప్పటికీ ... నాల్గు మెతుకులు కొరికి తీరా ఆఫీసుకు అని బయటికొచ్చి చూస్తే ఎండ చెత్తమాడ్చేస్తూంటుంది. అందులో మరీ ... ఇవ్వాళ మా అత్తగారు ఆగమనం చేసేటప్పటికి మన పని మ రీ కూ సిం ది. హూగవారా ... ఏం ఖర్మండీ ... ఈ మొగాళ్ళ బ్రతుకు ... !

ఆఫీసులో కాలుపెట్టానో లేదో మా కమీషనర్ నుంచి ఆఫీస్ బాయ్ "అటెన్షన్"లో నిలబడి ఉన్నాడు నాకుర్చీకి ఎదురుగా చిట్టీతోనహా. ఆ చిట్టీ చూట్టంతోటే అందులోని 'అర్జంట్' అనే కొంగ గితలయితే నా ప్రాణాల్ని గతుక్కుమనిపించాయి. అర్జంటు అంటే మా ఆఫీసులో ప్రతివాడికీ తెల్సు ... మా కమీషనర్ గారికి కోపం వచ్చిందంటే ఎట్లా ఉన్నవాడు అట్లాగే తనముందు హాజరు అవ్వాలని దాని అర్థం.

ఇవాళ ఇదేదో మనముంపుకే ఒచ్చిందిరా దేవుడా! అనుకుంటూ లోపల ప్రవేశించగానే తాత్రవగ్గొట్టు ముఖం రిజిస్ట్రార్ గాడు కూడా అక్కడే ఏడిచాడు. ఇంకోటేమిటంటే ... మా కమీషనర్ అచ్చభారతీయుడైనా మాట్లాటం చూస్తే ఆయన్ని ఐరోపా దేశీయులెవరో ఖర్మంజాలక మన దేశానికి పార్సిల్ చేసినట్లుగా తలచాల్సి ఒస్తుంది.

"నీవు చాలా రోజుల్నుంచీ ఆఫీసుకు ఆలస్యంగా ఒస్తున్నావుట" హారి ... వీడమ్మ కడుపులో ఎట్టుటి నిప్పుబొగ్గులు వెయ్యా. ఈరిజిస్ట్రారుగాడె ఏదో ఫుల్ల తగలేశాడల్లే ఉంది చూడు ఇంకా ఎట్లాచూస్తాడో పాయిఖానా లెత్తే మచ్చల్లే.

"లేదుసార్, ... ఓ అయిదు నిముషాలు మాత్రమే ఆలస్యం అయిందిసార్. క్షమించాలి."

"క్రితంలో ఓసారి మీకు వార్నింగు ఇచ్చి ఉన్నానేమోగూడా. ఇంకా ఆలస్యంగా రావడం మానలేదు."

ఇంతవరకూ ఆయన వార్నింగు ఇచ్చాడో ఇవ్వలేదో ఆ భగవంతుడుకే తెల్యాలి. వెధవ ఈ చిన్న విషయంలో కూడా అబద్ధం ఆడట మన్నది ఆయనకే చెల్లుతుంది.

నేనుకూడా ఏది అనాన్ని అబద్ధం ఆడకపోతే లాభం లేదనుకొని,

"మారూట్ బస్సులు త్వ ర గా అందటంలేదు సార్."

"ఏరూటువి ?"

"సెవెన్, బి, రూటు సార్"

"అటువంటప్పుడు ఓ అర్థగంట ముందుగానే బయల్దేరాలి. తెల్సిందా ... ? సరే ... ఈ మారు ఇట్లాగే చేస్తే మంచిదిగాదు..."

"చిత్తం సార్"

బ్రతికాంరా బాబూ అనుకుంటూ ఆ గదిలోనుంచి బయటపడ్డా. ఈ వేళ లేచినకాలం మంచిదే కాబట్టి ఇంతవరకే సరిపోయింది. ఇతరత్రా తగిలితే నా పని ఖాళీ అయ్యేది.

అక్కడా అక్కడా తిర్గి ఇంటికి వెళ్ళేటప్పటి కూడా ఓఅర్థగంటచిలుకు ఆలస్యమయింది. శ్రీమతిగారు చక్కగా సింగారించుకొని గుమ్మానికి అడ్డంగా నిల్చుంది ఒయ్యారమంతా ఒలకబోసుకుంటూ.

లోపలికి పోయి ప్యాంటు ఊడదీస్తే దాన్ని తీసుకొని మడతవేసి వంకికి తగిలిస్తూ, "అమ్మ ... పండక్కి తీసుకొని వెడుతుందిట."

అసలే చిరాగ్గాఉంటే మయాన ఇలాంటివి, దాపరించకూడదు గాని దాపరించాయో అగ్నిజ్వాలకంటే తీక్షణంగా మెదడుకు అంటుతుంది.

"ఎవర్ని," వినుగుతో.

"మనిద్దర్నీ ..."

"అయితే...నీవు పోతే పో..."

"మరి ... మీ మాట."

"నా మాటాలేదు...నీ మాటాలేదు. నేనొకడికి నౌకరీ చేస్తున్నా గాని ఖాళీగా తిరగటంలేదు. నాకు శెలవు కావాలంటే నీతల్లో జేజెమ్మతిర్గి రావాల్సిందే గాని మరింకోటి ఏదీలేదు."

"మీరు రాకపోతే నేనుపోయి ఏంలాభం."

"లాభమో, నష్టమో...ఎట్లా ఏడుస్తావో ఏడు"

"ఎందుకండీ, అంత విసుగ్గా మాట్లాడతారు."

"ఎందుకా నా శ్రాద్ధానికి, నీవు పో-తే పో..."

"మరి...మీ సంగతి."

"పిచ్చిపిచ్చిగా వాక్క ... తలుపేసుకొని అఘోరించు."

మనస్సంతా కయ్యాలిగా ఉన్నది. ఏంచేద్దామన్నా బుద్ధిపుట్టటంలేదు. నెమ్మదిగా ప్రక్కనే ఉన్న అయ్యరుగారి మఠంలో ప్రవేశించి అయ్యరుగారి సర్వరు ఇచ్చిన ఆ పాచిపులుసుసాంబారిడ్లీయే ఎక్కించి ఓ కప్పుటీ త్రాగేటప్పటికి ఇంకా అక్కడ కూర్చోబుద్ధి పుట్టలేదు. బయటికి వచ్చి కన్ను రోడ్డుపైకి ఎత్తేటప్పటికి సాధనావారి సంసారం బోర్డు కనుపించింది. ఇంటికిపోయి చేయవల్సిన పనులేమీ లేవాయె... పోనీ సినిమాకు పోదాము అని బస్సు స్టాండుకు వెళ్ళి నుంచుంటే ఎంత సేపటికీ బస్సులు రావటం లేదు. చచ్చాంరా దేవుడా అనుకుంటూ పోనీ ఇంకో అర్ధో, పావో చూద్దాం అనినుంచున్నా. నిజానికి ఆఫీసులో మా ఆఫీసరుకు నేను అబద్ధం చెప్పినా ఇప్పుడు ఆ అబద్ధం నా ఆచరణ లోకే ఒచ్చింది. అబద్ధమెట్లా అని అంటారేమో, బస్సు కోసం తిప్పలెందుకని రోజూ నేను రిక్షామీదే ఆఫీసుకు వెళ్ళటం మూలంగా బస్సుల గొడవ, సగం తగ్గిపోయింది. అటువంటప్పుడు బస్సులు జల్దీగానే అందుతున్నాయో ఆలస్యంగానే అందుతున్నాయో నాకేం తెల్సు. ఆయన అబద్ధమాడితే నేనూ అబద్ధమే చెప్పాను. అంతే గదండీ... కుక్కకాటుకు చెప్పు దెబ్బ అని ఊరికే అన్నారా... పెద్దలు. ఇంకా ఇలాగే కూర్చుంటే నేను శికింద్రాబాదు పోయి నట్టే. ఇక ఆట చూచినట్టే. మళ్ళీ మా వాహనాన్ని మాట్లాడుకొని తీరా ప్యారమౌంటు సినిమా హాలు ముందు కొస్తే జనం ఇసకవేస్తే రాలనంతకిటకిటగా ఉంది. అందులోఅది రెండోరోజు మొదలుపెట్టే. అదీకాకుండా శనివారంపూట బడిపిల్లలు స్కూళ్ళు కూడా ఎగ్గొట్టి ప్రొద్దున్ననే కూర్చున్నారాయె.

చచ్చిందిరా గొర్రె అనుకుంటూ నెమ్మదిగా మానేజర్ అనే బోర్డును చూచి లోపలకు వెళ్ళా. పైనున్న వర్కు సిల్కుదైనా, గూడ కట్టు వాణ్ణి నన్ను చూట్టంతోటే ఎత్తిన ముఖాన్ని క్రిందికి దించుకున్నాడు కూర్చోమనే మాటన్నా అనకుండానే. నమస్కారం చెప్పి ఓ సెకండుక్లాసు టికెట్ ఇప్పించమని కోరితే, ఆయన ఫక్కున నవ్వి, సెకండు క్లాసు కాదు గదా, ఫస్టుక్లాసుది కూడా దొరకదనే టప్పటికి నా ఒళ్ళు వాడి నవ్వుతో, నాకు కోపంతో జలదరించింది. "అయితే ఓ బాక్సు టికెట్ ఇప్పించండి." మళ్ళీ వాడూ ముప్ఫయిరెండు పళ్ళూ బయట పెట్టి "ఓహ్...హి...హి...హీ... ఓ బాక్సు టికెట్ ఎట్లా ఇస్తారయ్యా...రెండూ...రెండు... హి...హి ...హీ" ఇక ఆ నవ్వును నేను భరించ లేకపోయాను. నాదేహమంతా ఏదో తెల్యని ఆవేశంతో నిండిపోయి, జేబులోని పదిరూపాయల నోటును పెద్దమోత చేస్తూ బల్లమీద నొక్కిపెట్టటంతో వాడు నవ్వు ఆపి, తెల్ల బోయాడు. చిల్లర పైసలూ, రెండుటిక్కెట్లకూ వాడు రాసిన కాగితం జేబులో కుక్కుకొని రోడ్డు మీదికొచ్చే టప్పటికి ఓ గుంపు నా కండ్లను తట్టింది. అదేమిటంటే ఓ చిన్న కారును తోస్తూన్న పది తొమ్మిదేండ్ల ఈడుగల ఓ యువతి, ఆమె చుట్టూ గారడీ వాడి పామును చూస్తూ నుంచున్న వాళ్ళల్లే పాతిక ముప్ఫయి మంది చిన్నా పెద్దాతో కూడినదా దృశ్యం. నేనూ అక్కడకు పోయి నుంచున్నా. ఆ గుంపు అంతా కేకలూ కేరింతాలూ ఆడుతుంటే పాపం... ఆమె సిగ్గుతో కూడా తోస్తోంది ఆ కారును. పరీక్షగా చూస్తే ఆమె ఏ మహారాష్ట్ర స్త్రీయో, లేక ఏ బెంగాలీ స్త్రీయో అనుకోవచ్చు. ఆమె ఎంత నెట్టినా ఆ వాహనం ఓ అడుగైనా కదల్చలేని స్థితిలో ఉంది. నేనూ నవ్వుతో చూస్తూ నుంచున్న సమయంలో ఆ గుంపులోని ఓ పోకిరీ ఆమె ముందుకు తోస్తున్న కారును తాను వెనక్కు నెట్టడం ప్రారంభించటం, చుట్టూ ఉన్న మూక అంతా నవ్వటం, గోల చేయటంతో నా ఒళ్ళు భగ్గుమనింది. ఆతని చెంప పెఠీల్‌మని శబ్దం చేసేటప్పటికి, అరచేయి చూచుకుంటున్న నా వైపుకు ఆ త్రాష్టుడు ప్రక్కనున్న పెద్ద రాతితో కొట్టబోయాడు. వాడు రాయి ఎత్తే సమయానికి అమాంతంగా వాడి మీది కురికి రాయి నాపై పడబోయే క్షణానికి రాయితో సహా ఎల్లకింతలు అయేట్టు చేశా వాణ్ణి. బోర్లపక్కగా పడ్డ అతణ్ణి చూచి మిగతా రకం చల్లగా జారుకుంది. ఇంతలో

నా పక్కన ఉన్న ఇద్దరుపోలీసులూ, నాచొక్కా పట్టుకోటంలో వెనక్కి తిర్గి చూస్తే ఎఱ్ఱ టోపీలు ప్రత్యక్షం. ఈ అదనుకు వాడు మళ్ళీ నామీదకు పడటానికి జోరుగా ఎప్పుడయితే లేచి ఒస్తున్నాడో ఆ సమయాన ఒక్క ఎదిరింపుతో పోలీసు పీడ ఒదిలించుకొని పోలీసు చేతిలోని లాఠీ గుంజుకొని వాడి కాళ్ళమీద ఓ చురుకు ఒడ్డించే టప్పటికి ఒచ్చే ఒచ్చే వాడు మళ్ళీ కూలబడ్డాడు. ప్రత్యక్ష పరిమాణంతో ఆ పోలీసు వెంటనే ఒచ్చి నామెడ వాటేసుకుని ముందుకు తోయాలని చూట్టంతోటే అసలే కోపంగా ఉన్న నేను చాచి ముఖంమీద గుద్దటంతో పోలీసువాడు ముక్కునుంచి నెత్తురు కారుతుండగా మీదికి ఉరికాడు.

అంతవరకూ ఆశ్చర్యంగా చూస్తూన్న ఆ అమ్మాయి పరుగెత్తు కుంటూ ఒచ్చి, "వార్ని కొట్టకండి. నాను ఈ రౌడీ మచ్చునుండి నన్ను కాపాడారు" అని, నాకూ ఆ పోలీసుకీ మధ్యంగా నుంచుంది. పోలీసు సంగతేమని అడిగితే, "తానుసినిమాకిఒచ్చాననీ. ఇక్కడికి ఒచ్చే టప్పటికి పెట్రోల్లు అయిపోయిందనీ, ప్రస్తుతం కారును సినిమాహాలు షెడ్డులో పెట్టి తర్వాత దానిని గూర్చి ఆలోచించవచ్చనీ అనుకొని అక్కడఉన్నవాండ్లను కారును షెడ్డులోనికి త్రోయటకు అడుగగా వారు సహాయం చేయకపోగా ఎద్దేవా చేసి వెక్కిరింపులు మొదలు పెటారనీ, తానే వెమ్మదిగా ప్రక్కకు నెట్టడానికి పూనుకుంటే ఆ దెబ్బలు తిన్న మూర్ఖుడు వెనక్కి త్రోయటం మొదలు పెట్టాడనీ, ఇంతలో ఈయన ఒచ్చి వాడికి బుద్ధిచెప్పితే వాడు ఎదురు తిరిగాడనీ, వీరుకూడా వాడికి దేహశుద్ధి చేశారనీ" ఆ మాటలు సారాంశంగా తేలింది. ఈ చరిత్రాంతా వినేటప్పటికి పోలీసు వాండ్లు అదో మాదిరిగా నవ్వుతూ అక్కణ్ణించి వెళ్ళిపోయారు.

అంత టామె నా దగ్గరకు వచ్చి, "మీ మేలు మరువ రానిదిగా చేసారు. ఇంకా కొద్దిసేపు మీరే గనక రాకపోతే నాళ్ళు ఏమిచేయటానికికూడా వెనుకదీసేవారు కాదు. మీకు కృతజ్ఞురాలను" అంటూ నమస్కారంచేసింది. ప్రతినమస్కారం చేస్తూ, "ఆ... దానికేం లెండి. ఎవరైనా ఆపత్తులో ఉంటే సహాయం చేయటం మానవ ప్రకృతి. లేకపోతే... పెధవలంతా తెలుగు నాళ్ళయినా ఇంగిత జ్ఞానమనేది ఏమాత్రానా లేదు. భగవంతుడు వాళ్ళకు పెట్టిండ్ మట్టిబుఱ్ఱ గాని మెదడు గాదు."

"అరే... మీసరు అంతా సీలికలై పోయిందే...!"

అంతవరకూ నా దృష్టి షర్టుమీదికి పోనేపోలేదు. ఈ మాట వినేటప్పటికి నాకు చెడ్డ సిగ్గు వేసింది.

"పోనీ బజారుకు పోయివద్దాం. రాకాదూ?"

"నిజమే...బజారుకు పోయిరావచ్చును గాని మీరు సినిమాకువచ్చారాయె...! ఇంకా మేట్నీఒదలడానికి కెంతోఆలస్యంగూడాలేదు.మరిమీరుకూడా...! అర్థోక్తిలో ఆగిపోయిన నా ముఖంవంక చూస్తూ, చిరునవ్వుతో"మీరుసినిమాకేఒచ్చారని నాకుతెల్వదనుకుంటున్నారా ? మీరూ టిక్కట్లకోసమై ఇబ్బంది పడాల్సిందే కాదా ? మీకు లేని ఇబ్బంది నాకెలా ఉంటుందో చెప్పండి' అంటూ ప్రశ్నార్థకపు ముఖం వేస్తూ అడిగింది.

"అట్లా అనబోకండి. నేను ఇంతకు క్రితమే రెండు టిక్కట్లు రిజర్వు చేయించుకునే ఉన్నాను." అని ఆమెముఖంమీదికి చూసే ఆ ముఖంలో కొంత అనుమానము తగిలినట్టుగాతోచింది. వెంటనే "ఒక్కటిక్కట్టుదొరక్కపోతే బాక్సుకే తీసుకోవాల్సి ఒచ్చింది.' అంటూ అట్లాగే ఆమె ముఖం మీదికి నా చూపులు పోనిచ్చా. పాఠకులకు ఓ సంశయం కల్గిందని తోస్తోంది. ఏమంటే వీడు టిక్కట్టు దొరకనంత మాత్రాన వృథాగా డబ్బు తగలేసి ఎందుకు సినిమా చూడాలా ? అనే అనుమానం తోస్తోందిగదూ ? చేయాలనీ, చూడాలనీ, తినాలనీ ఉన్న ఉద్దేశ్యాన్ని కొనసాగింప చూచేందుకు కూలీలయినా చేయటానికి జంకులేని ఈ మనస్తత్వాన్ని గురించి చెప్పాలంటే భావకవులు గానీ ప్రాచీన ఆధునిక కవిసత్తములు గానీ లేక మరేరకంవారే గానీ సాహసించలేదు ... సాహసింపరు ... సాహసింపబోరు. అటువంటివారి అదుపాజ్ఞలకు సరికాని మనస్తత్వాన్ని అదుపాజ్ఞలందుంచుటకు నా తరమా ...? చూడాలనే కోరిక ఆ మనస్సునందు కనుక ఏర్పడిందంటే దాన్ని అణచుకోవాలంటే చెడ్డకష్టం వేస్తుంది. అదీకాకపోగా ఇప్పటికే ఆ మేనేజరుగాడి వెకిలినవ్వే జ్ఞాపకం వస్తూ మరీ కోపావేశుణ్ణి చేస్తోంది.

అట్లా ఆమె ముఖమండలాన్ని వీక్షిస్తుంటే, నేను ఏ కాళిదానును గానీ, మరే ఇతర పూర్వకాలపుపండితుణ్ణిగానీ, నేటికవుల్లో శరత్ నుగానీ, కవి సామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణను గానీ, లేక హాస్యరసకథా సరివంత ముని మాణిక్యంగార్ని గానీ అయిఉంటే, అబ్బ...వాళ్ళనే మించిపోయే వాడినేమో...! ఆ సుందర ముఖపద్మాన్ని తన్మయుణ్ణయి చూస్తూ "ఎట్లాగో నేను రెండు టిక్కట్లు తీసుకున్నాను

గదా...? మీరు ఓటిక్కట్టు ఉపయోగించకూడదా?" ఈ ప్రశ్న వేసి నాలో నేనే ఆశ్చర్యపోయానంటే నమ్మండి. ఎవరో ఓ అర్ధగంటసేపు మాట్లాడితే, అందులో ముక్కూ ముఖమూ ఎరుగని ఆవిణ్ణి అట్లా ప్రశ్నిస్తే నాకేగాదు, మీకూ్కూడా ఆశ్చర్యమేమిటి నా మీద విరక్తి కూడా కలుగవచ్చు.

అంతవరకూ తలక్రిందికి దించి, కాలివేళ్ళతో చెల్లాచెదరు చేస్తూన్న ఇసకను చూస్తూన్న ఆమె మెల్లగా తలఎత్తి. "మరేమీ, ఫరవాలేదు. కొద్ది శ్రమా, ఆలస్యమయినా టిక్కట్టు తీసుకురాగలను. కాని ఈ కారు విషయమే నాకు పట్టుకుంది."

"ఆ కారు విషయం నేనుచూస్తాను. మీరు రెండో సీటు తప్పకుండా ఉపయోగించాల్సిందే... ఇట్లా అన్నానని మీకు కోపం కూడా రావచ్చు."

ఈ మాటలు నా నోటినుంచే ఒచ్చాయా? అనే సందేహంతో నేను గజగజా ఒణికిపోయాను.

"కోపం దేనికీ... కోపగించ వలసిన పెద్ద విషయమేదీ లేదే" అదుగో... సినిమా ఒదిలేసారు. ఇంకో అర్ధగంటో ఎంతో తప్పితే మనకు టైం కూడా లేదు. మరి మీ బట్టల సంగతి ఏమిఆలోచించాలి ?"

"అబ్బా... పెట్రోల్ టిన్ను ఉంది కదూ. నే నిప్పుడే పెట్రోల్ తెస్తా నుండండి." అంటూ ఆమె డబ్బు ఇస్తున్నా తీసుకోకుండా కింగ్సువే జిమ్మిన్ కలిసే సెంటరుకు ఒచ్చి పెట్రోల్ పోయించుకు వచ్చాను.

"భేష్... బలేగా ఉందే...! పైసలు కూడా తీసుకోకుండా మీ ఖర్చుతోనే పోయించుకొచ్చారే... ఇదేం పనంట...!"

"ఆ... ఏమీ ఫరవాలేదు. దాంట్లో మునుచుకు పోయేంత ఖర్చేమీ లేదు." అంటూ పెట్రోలు పోసి కారులోఎక్కి సెల్ఫ్‌స్టార్టు చెయ్యటం తోటే, డోరు తెరుచుకు లోపల ప్రవేసినూ "మీకు డ్రైవింగ్‌కూడా వచ్చులే ఉందే?" అంటూ చిరునవ్వుతో నా చెంపల వైపు చూచింది.

"ఆ...ఈ రోజుల్లో ఆడదే డ్రైవింగ్ చేస్తూంటే మొగవాడి మాట వేరే చెప్పాలా...!" అంటూ ఉండగానే ఆమె ఒక్కసారిగా బుంగ మూతిపెట్టి తర్వాత నా కండ్లను ఛేదిస్తూన్న దృష్టితో ఫక్కున నవ్వటంతోటే నేనుకూడా నవ్వు ఆపుకోలేకపోయాను.

ఆహా...! ఒక్కొక్కరి మాటల్లోనూ, ఒక్కొక్కరి చేతల్లోనూ,ఒక్కొక్కరి నవ్వుల్లోనూ ఎంతెంతతారతమ్యం ఏర్పరిచాడోగదా ఆ భగవంతుడు! మేనేజరు నవ్వు నన్ను కోపంతో ప్రజ్వలింపచేసింది. ఈమెనవ్వు నా ఆకోప, తాపాల్ని విలీనపరచి హృదయానందాన్ని చేకూర్చింది. కారు కింగ్సువేలోని ఓబట్టలషాపు దగ్గర ఆపి లోపలకు వెళ్ళి పనిపూర్తి చేసుకు ఒచ్చేటప్పటికి ఆరుముప్పావు అయింది. ఇద్దరమూ హాలు లోనికి పోయేసరికి వార్ రీల్ నడుస్తోంది. సోఫాల్లో కూల బడ్డాము పరమసంతోషంగా...!

(సశేషము)



# ఎన్నికల విశేషాలు - కొన్ని యంకెలు

## శ్రీ కృష్ణకుమార్

ప్రజల ఇష్టానుసారము తామిచ్చే వోటుపైన ప్రజాస్వామ్యప్రభుత్వమును ప్రజలే యేర్పాటుచేసికోవచ్చునను వయోజన వోటింగు పద్ధతిపైన ఈ యెన్నికలు జరుపబడుచున్నవి. 21వ సంవత్సరము వయసు గలవారందరకు ఓటుహక్కుగల ఈ యెన్నికలు భారతదేశమంతటా జరుపబడుచున్నవి. ఈ ఓటర్లసంఖ్య 18 కోట్లు. 2 లక్షల పోలింగు కేంద్రాలు, 20 లక్షల బాలెటు పెట్టెలు, 52 కోట్ల బాలెటు పేపర్లు, ఈ ఎన్నికలుకు 5 కోట్ల ధనము ఖర్చు అగును. భారతదేశము మొత్తముపైన 3293 నియోజకవర్గాలకు 4412 మంది ప్రతినిధులు ఎన్నుకోబడుతారు. దేశమంతా ఒకేసారి యెన్నికలు జరుపక ఏర్పాటైన తేదీలవారిగా ఆయానియోజక స్థానాలలో ఎన్నికలు జరుగుచున్నవి. ప్రతి పోలింగు స్టేషనుకు ఒక ఆఫీసరు 5 గురు గుమాస్తాలు నలుగురు పోలీసులు పనిజేయుచున్నారు. మొత్తానికి 56 వేల ఆఫీసర్లు 280 వేల గుమాస్తాలు 224 వేల పోలీసు సిబ్బంది యెన్నికల్లో పాల్గొన్నారు.

హైద్రాబాదు రాష్ట్రమున 1951 డిసెంబరు 21వ తేది నుండి ఎన్నికలు ప్రారంభింపబడినవి. 1952 సం॥ జనవరి 18వ తేది వరకు జరుగును. సంస్థానము మొత్తము 142 నియోజకవర్గాలు. 8777 పోలింగ్ స్టేషనులు యేర్పాటు గావింప బడియున్నవి. 67546 బాలెటు పెట్టెలు సిద్ధముజేయబడి యున్నవి. 90 లక్షల వయోజనులు వోటుయిచ్చు తమ హక్కును వినియోగపరుచుకొనుచున్నారు.

వోటరు తనఇష్టమువచ్చిన పార్టీకివోటువేయ గలందులకు ఆ పార్టీకి సంబంధించిన బాలెటు పెట్టెలపై గుర్తులు చూపింపబడియున్నవి. ఈ గుర్తులవలన యెన్ని పార్టీలు రాష్ట్రమున ఎన్నికలలో పోటీచేయుచున్నవో పల్లెటూరి పాఠకులు తెలిసికోవలసియున్నది.

కాంగ్రెసు డబ్బాకు- కాడి ఎద్దులు.

నిరక్షరమైన హరిజన కాంగ్రెసుకు-చక్రము లోకాడిగల ఎద్దులు.

సోషలిస్టు పార్టీకి - మర్రిచెట్టు.

డిప్రెస్డుక్లాసెస్ అసోషియేషనుకు - నిచ్చెన.

ప్రజాపార్టీకి - విల్లంబు.

రిపబ్లికు పార్టీకి- కొలతబద్ద.

డెమాక్రాటిక్ ఫ్రంటుకు - హస్తము.

పెజంట్ పార్టీకి - సైకలు.

యు. ఎస్. ఎఫ్‌కు - ఒంటె.

ఇండిపెండెంట్‌గు - జోటు.

నిమ్నజాతి ఫెడరేషనుకు — ఏనుగ.

రామరాజ్యపార్టీకి - ఉదయిస్తున్న సూర్యుడు.

స్వతంత్రులకు-సింహము, పార, నక్షత్రం నాగాలుపట్టుతున్నరైతు, రైల్వే ఇంజన్, పుష్పం, రెండాకుల కొమ్మ. కూజ. త్రాసు కోడి. బండి.

హైద్రాబాదు శాసన సభకు 175 మంది అభ్యర్థులు, పార్లమెంట్ 25 మంది అభ్యర్థులకుగాను, శాసన సభకు 556 మంది ఢిల్లీ పార్లమెంటుకు 70 మంది అభ్యర్థులుపోటిచేసే ఎన్నికలు అతిజోరుగా సాగింపబడుచున్నవి.

# గ్రామచావుడి — రచ్చకట్ట ముచ్చట్లు

రైతు: పంతులూ, ఊరిలోని చింతచెట్లన్ని సర్కారి వారివేనా? మా పెరడులో ఉన్న తాత ముత్తాతలు పెంచిన చెట్టుకు తజుదీఖు కావాలంటా. నిజమేనా మావాడన్నాడు.

పంతులు: అవును. ఇటీవలనే గస్తీ ఒకటి వచ్చింది. ఊరిలోని చింతచెట్లన్ని వేలము వేసి. వాటినుండి వచ్చు ఆదాయము సర్కారి ఖజానాలో జమకట్టుకుందురు. చెట్టుతమదనిపించుకొనుటకు తజుదీకు కావలసి వచ్చును.

రైతు: ఇకముందు- కాపురము చేస్తున్న పెండ్లానికిగూడా తజుదీఖు కావాలని అడుగుతారేమో!

◆ ◆ ◆ ◆

సేకుసేంది: రామయ్యా! గిర్దావరుగారు వచ్చిండ్రు, నీవు లేవీ పెట్టలేదట. కరణముపంతులుగారు పంపుతే వచ్చినా

రామయ్య: ఈ లేవీకరము మీదికి వచ్చింది. పండిన పంటలో లేవీ చెల్లించుటకు నాగుకైన లేక ఖరీదు చేసియైనా తేవాలనుకున్నాను-

సేకుసేంది: పన్ను రూపాయిలకై పెట్టాల్సిన లేవీ వాళ్ళగండానికే వచ్చింది. అయితె పెట్టక తప్పదు గదూ!!

రామయ్య: సేకుసేందీలు బేగారీలు మీరే నేటికి గట్టెక్కినారు. మీకులేవీ మాఫ్ అటగదూ! రైతుకష్టముకంటె బేగారి సేకుసేందీయేమేలని పిస్తున్నది

◆ ◆ ◆ ◆

కరణముపంతులు: స్వాతంత్ర్యము వచ్చిందంటె స్త్రీలపనే మేలన్నట్లున్నది. క్రొత్త ఖానూనులో వారికే మంచిహక్కులు.

పటేలు: ఇప్పుడేమో రామయ్య పెండ్లాము వెంకయ్య భార్య అని మొగనిపేరు ముందు వస్తూ యున్నది. ఇదిపోయి ముందురానురాను రామమ్మ భర్త వెంకమ్మ మొగడు అని స్త్రీ పేరే ముందు వాడుకలోకి వచ్చునేమో?

కరణముపంతులు: సీతాపతి, లక్ష్మీపతి, గౌరీపతిఅని ముందు ఉండలేదా!

◆ ◆ ◆ ◆

సత్తయ్య: అధికాహారోత్పత్తి కావాలన్న కె. యం. మున్షీగారు రైతులంతా విద్యావంతులు కావాలని పెద్దసభ హాల్లిలో జేసినారంట.

సాంబయ్య: ఈ లేవీ కంట్రోలు పోతే రైతులంతా విద్యావంతులు కావచ్చును. రైతుకు సర్కారోల్లకు లేవీ పనులే మితిమీరి నప్పుడు రైతులు విద్యావంతులు అయ్యే దీ లెక్కడ-

సత్తయ్య: ఈ లేవీ కంట్రోళ్ళ వలన లంచగొండితనము బ్లాకు మార్కెటు విద్య మాత్రము బాగా వచ్చింది.

◆ ◆ ◆ ◆

నాగయ్య: యాదగిరీ! తొలికోడి కూసింది. చలిబాగా వేస్తుంది ఇప్పటినుండి చలిమంటలకేమీ తక్కువలేదు.

యాదగిరి: ఈ యేడు పుట్టెడనుకుంటె పందుము పండింది. గింజలు పండకున్న గడ్డి మాత్రము మస్తుగ వున్నది. మంట వెయ్యి నాగయ్యా!

నాగయ్యా : పొట్టకు లేకుంటే కడుపుమంట, శిస్తీ చెల్లింపకుంటే సర్కారోళ్లతగాదా యొకమంట, తెచ్చినచోట యివ్వకుంటే చింత ఒకమంట. లాగోడి శీతగాళ్ళదోకతంట. నిదురబట్టకపోతే చలిబాధగూడ మనకేనంట! ఇంక చలిమంటెందుకయ్యా? అన్ని మనలనే కాల్చేస్తున్నవి.

♦ ♦ ♦ ♦

చెల్లయ్యా : ఒరే మీతాత నడిగినావా! ఓటంటే యేమో.

తిమ్మయ్యా : ఆయనకేమి తెలుసోయి చెల్లయ్యా.

చెల్లయ్యా : మన్నవచ్చినోళ్లు చెప్పిండ్రు మనము వోటిచ్చియెన్నుకును వారే నంట కొత్త రాజ్యానికి అధికారులు.

తిమ్మయ్యా : అట్లైతే వాండ్లకంటె మనమే గొప్ప; మన వోటే గొప్ప, ఇంక మన వోటు వాండ్లకెందుకివ్వాల. మనవోటు మనదగ్గరుంటే మనమే అధికారులముగామా.

---

( 17 వ పేజీ తరువాయి)

మద్రాసు రాష్ట్రమున ఈ నూతన సంవత్సరము జనవరి 2వ తేది నుండి ఎన్నికలు ప్రారంభింపబడియున్నవి. ఆంధ్ర జిల్లాల్లో 145 శాసన సభకు, 22 పార్లమెంటు స్థానాలకు ఎన్నికలు జరుగుచున్నవి. మద్రాసు రాష్ట్రమున 2 కోట్ల 70 లక్షల మంది వోటుచేయుచున్నారు.

హైద్రాబాదు రాష్ట్రములో యెన్నికలలో 13 పార్టీలు పోటీచేస్తూయున్నవి. మొత్తం మీద కాంగ్రెసుకే విజయం.



ష్యులనీబస్సులలో నింపుచుందురు. స్త్రీలు కూర్చుండే సీటు నిండి చీమ జొరరాని సందు లేకుండా యొకరిపై నొకరు కూర్చున్నవారు, కష్టతరముగా యొకరినొకరి నదుముకొని నిలుచున్న వారు స్త్రీలు పిక్కటిల్లి యున్నారు. పాపమా నాతో ప్రయాణము చేసినముగ్గురిలో నొక స్త్రీ పుట్ పాట్ నానుకొని నిలబడియున్నది. రైలు డబ్బాలో కాళ్లు ముడుచుకొని యుండగా కలిగిన ఝగడా ఆమెను కలవర పెట్టుచుండ కాళ్లుపూని నిలుచుండుటకు గూడ కష్టతరమైనది. చిన్న బస్సు, పొడవాటి మనుష్యులు వంగినిలుచుండి నను బస్సుపరుగున యెతు తగ్గుచోట్లలలో నెగురు నప్పుడు పకాపకామని తలలు కప్పుకేకునకు కొట్టుకొనుచుండును. వంగిన ముడ్డి, వీపు, వంచిన యిరు పక్కలు లెక్కలేని తాకుళ్ళకు ఓర్చుకొనవలసి యుండును. యెట్లో ఉదయమైదున్నరగంటలకు వనపర్తికి చేరుకొని బ్రతుకుజీవుడాయని బయటపడి గమ్యస్థానము చేరితిమి. ఇది నా వనపర్తి ప్రయాణము.

నేను జేరుకొన్నది 28వ తేది ఉదయము. డిసెంబరు 27వ తేదినాడే వనపర్తి నియోజకస్థానమున పోలింగ్ జరుపబడినది. వనపర్తి నియోజకస్థానమునకు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు కాంగ్రెసు అభ్యర్థి. వీరు సంస్కృతాంధ్రమున యసమానపాండిత్యము సంపాదించిన వారు. వేదము వెంకటరాయ శాస్త్రిగారి శిష్యులు. ఆంగ్లభాషాకోవిదులు; బి.ఏ.బి యల్., పట్టము నందినవారు. ఉర్దూపార్శీపండితులు. పేరుగాంచిన రచయితలు, మేధావిశేషసంపన్నులగుకవులు. వీరురచించిన బహుగ్రంథములు ఆంధ్రలోకమున సుప్రసిద్ధములు. తెలంగాణాలో ప్రతాపరెడ్డిగారిని తెలియని యాంధ్రుడుండడు. విద్యార్థిదశనుండి గాంధీసిద్ధాంతము లకలవడియున్న ఖద్దరుధారియగు కాంగ్రెసువాది. హరిజనులన్న వీరికి యపారమైన ప్రీతి. ఈ విషయము వీరు రచించిన పండరిపుర చరిత్రలో చెప్పబడిన హరిజనభక్తుడు చెంకామేళుని నాటకమున తెలియనగును. తెలంగాణమున కవులనుసృష్టించిన కవిబ్రహ్మ యనుటకు కవుల చరిత్రయే సాటి. సాంఘికరాజకీయాలగూర్చి వీరనేకగ్రంథములరచించిరి. గోలకొండ పత్రిక రచనలద్వారా తెలంగాణా ప్రజలకు చైతన్యముగలుగజేసి కాంగ్రెసు యుద్యమారంభమున, స్వాతంత్ర్యమునకై రజాకారు కాలమున, పోరాటము సలుపుటకుసిద్ధపరచినసత్యాగ్రహుల శాంతిసమరముగూర్చిన ప్రతాపరెడ్డిగారి రచనలే మనకెక్కువగా జ్ఞాపకమునకు వచ్చుచుండును. వనపర్తి నియోజకవర్గ వాసులకిది బాగుగా తెలియును. పోటీగా నిలిచిన స్వతంత్ర అభ్యర్థియగు శ్రీ రామచంద్రారెడ్డిగారు బి, ఏ. ఎల్. ఎల్. బి. పట్టమునందిన న్యాయవాదులు. మరియు స్థానికులు. తాలూకా బంధువర్గమున మెలగినవారు. నానావిధములుగ ప్రచార ప్రయత్నమున దిట్టమైన యత్నము గావించినారగని సంగతి తెలియుచున్నది. వనపర్తి నియోజకవరమున 5 పోలింగు స్థానములున్నవి. ప్రతి పోలింగు స్థానమున ఓటుహక్కుగలప్రజలు అధికసంఖ్యాకులుగా పాల్గొని ఓటు చేసినారని సంగతి తెలియుచున్నది. కంచెరేవుపల్లి పోలింగుస్థానము. గుడ్డివాడగు నొక వోటరు నా వోటు కాంగ్రెసు యెద్దులడబ్బాలో వేయుదునని కాంగ్రెసు డబ్బాను చూపెట్టుడని యడిగెనట. వనపర్తి తాలూకా ప్రజలు కాంగ్రెసుపై భక్తివిశ్వాసములు గలవారు. యిచట కాంగ్రెసు వర్కరులు పట్టుదలగల కార్యదీక్షాపరులు. కొల్హారి శాసనము సృష్టింపబడినదన్న వనపర్తినుండియే యని చెప్పుటలో నతిశయోక్తియుండదు. రైతుక్షేమమునకై పోరాటము సల్పిన వనపర్తి, గుమ్మడం, సూగూరు, శ్రీరంగాపురం, సంకిరెడ్డిపల్లె, మదనాపురము కార్యకర్తలకృషి వర్ణనాతీతము. ఇందులో శ్రీ యం. జయరాములు గణనకెక్కిన వారు. [illegible]వలో పలుకష్టములనుభవించిన త్యాగశీలి. ముఖ్యంగా కాంగ్రెసువాదులంతా కాంగ్రెసుకే విజయము సంపాదించుట కెంతో కృషిచేసినారని సంగతి తెలియుచున్నది.

## గుమ్మడము

నేను వనపర్తినుండి 29వ తేది సాయంత్రమే గుమ్మడం చేరుకొంటిని. గుమ్మడము కృష్ణాతీరమునకు మైలున్నర దూరమున నుండును. ఇది రెండువేలజనసంఖ్యకు మించియున్న గ్రామము. ఈ గ్రామమున లోకలుఫండువారు త్రవ్వించిన చేదుడు బావులు లేవు. హరిజనులకు నీటి సౌకర్యము బొత్తిగాలేదు. మూడు దిగుడుబావులు కలవు. ఈ బావులనీటి వలన నారికురుపుల జాడ్యము విశేషముగా పొడచూపుచుండును. దాదాపు ఆరు సంవత్సరములకొకసారి కలరావచ్చి లెక్కలేకుండా మనుష్యులను చంపివేయుచుండును. గ్రామవాసులలో విద్య చాల తక్కువగాయున్నది. పారిశుధ్యమున గ్రామము చాల వెనుకబడియున్నది. ఈ గ్రామమునకు ప్రాథమిక పాఠశాల, యిద్దరు ఉపాధ్యాయులు అవసరము. ప్రభుత్వ విద్యాశాఖ

వారులోకలుఫండ్ శాఖవారు ఆరోగ్యశాఖవారు ఈ గ్రామము నెంతో బాగుచేయవలసియున్నది. గ్రామ పునర్నిర్మాణ మవసరము. ఈ గ్రామమున ఈ రంగారెడ్డిగారు విద్యావిషయమున ప్రైవేటు ఉపాధ్యాయులుగా కృషిసలుపు చున్నారు. వైద్యసేవగూడ చేయుచున్నారు. వయోజన పాఠశాల ద్వారా చేయవలసిన విద్యావ్యాపకమెంతో ఈ గ్రామమున కవసరము. గుమ్మడమునకు చేరువ పాటివారయను యొక దిబ్బ గలదు. అచట త్రవ్విన శంఖులు బయలుదేరు చుండును. ఇచట శంఖుల గాజుల ఫ్యాక్టరీ యొకటి పూర్వమున్నదని సంగతి తెలియుచున్నది. పురాతత్వశాస్త్రజ్ఞులు త్రవ్విచూచిన యింకా యేమేమి బయలు పడునోసంగతి తెలియదు. విద్యావైద్యశాల చేదుడు బావులు మంచినీటి సరఫరా ఈ గ్రామమున కవసరము.

## వ్యాపర్ల

నైజాము ప్రభుత్వ కాలమున ఈ గ్రామము కీ. శే. శ్రీ వామను రామచంద్ర నాయకుగారికి ఈ గ్రామము జాగీరుగా నుండెను. ఇది కృష్ణాతీరమున వ్యాపార కేంద్రముగా నున్నది. ఇప్పుడా వ్యాపారము జరుగుట బొత్తిగా లోపించియున్నది. ఇచ్చట దాదాపు 35 సంవత్సరముల క్రిందట వామన నాయకుగారి పోషకత్వమున సంస్కృతాంధ్ర పాఠశాల యొకటి నడుపబడుచుండెను. శ్రీఅనుముల వెంకటసుబ్రహ్మణ్య శర్మగారి యధ్యాపకత్వమున గురుకులము బోలె పాఠశాల వర్తించుచుండెను. ఆనాడు ఈ పాఠశాల విద్యా యోగ్యత గలవారిని కొందరిని సృష్టించగలిగెను. ప్రస్తుతము ఆంధ్రసారస్వత పరిషత్ శాఖయైనా గ్రామమున నేర్పాటు గావించుట మంచిది. స్థానికులందుకు ప్రయత్నము చేయవలసియున్నది. విద్యాసంపన్నులగు అనుముల వెంకట సుబ్రహ్మణ్య శర్మగారి గురుభక్తి. తెలంగాణ వాసులకు సేవజేసిన వామన నాయకుగారి ప్రతిష్ట గ్రామ ప్రముఖులు నిలుపవలసి యున్నది. కృష్ణాతీరమున నున్న గ్రామము విద్యాసేవ కెంతో యుపకరించును.

## అచ్యుతాపురము

ఈ గ్రామము వనపర్తికి రెండుమైళ్లదూరమున నుండును. లోగా శ్రీ వామన రామచంద్రనాయకుగారి జాగీరుగానుండి జటప్రోలు సంస్థానమునకు జెందియుండెను. ప్రస్తుతమిది వనపర్తి తాలూకాలో జేర్చబడినది. జాగీరుగానున్న కాలమున వామననాయకుగారి పోషకత్వమున యొకపాఠశాల నడుపబడుచుండెను. జాగీరు రద్దుఅయిన పిమ్మట పాఠశాలగూడ రద్దుగావింపబడినది. పెక్కేండ్ల తరబడియుండి యున్న పాఠశాల గోల్పోబడిన పిమ్మట బాలురకు విద్యలేకుండ బోయినందుకు గ్రామప్రజలు చింతించుచున్నారు. మున్సిపాల్టీబావులు యీ గ్రామమున లేవు. హరిజనులకు బావివసతిలేదు. నీటికి చాల కష్టపడుచుందురు. ప్రభుత్వపక్షమున మున్సిపాల్టీ వారు రెండు బావులు త్రవ్వించిన ప్రజలకు నీటివసతి ఆరోగ్యత ఏర్పడును. మూడుమైళ్ళకు దూరమందున్న చిట్యాల తహశీలు క్రింద ఈ గ్రామము చేర్చబడినందుకు జాగీరుకాలమునకున్న స్వయంహక్కులు గోల్పోయి ప్రతిపనికి గ్రామవాసులు చిట్యాలకు బనుగొట్టుట యెంతోకష్టము. కాంగ్రెసు యుద్యమమున కృషిసలిపి తెలంగాణా యాంధ్రులకు సేవజేసి విద్యాప్రజా సౌకర్యమునకు పాటుపడిన శ్రీ వామనరామచంద్రనాయకుగారి ఏలుబడిలోనున్న ఈ గ్రామప్రజలు నేడు చిట్యాలక్రింద పరతంత్రులై యుండుటకు యనమ్మతిని దెలుపుచున్నారు. ప్రత్యేక గ్రామసంఘము నేర్పరచి గ్రామాభివృద్ధిని చేయదలచుకున్నారు. ప్రభుత్వము ఈ విషయముపాటించి ప్రజల కోరిక యేమోదీర్చవలసి యుండును. గ్రామప్రజలు కాంగ్రెసుయందు భక్తి శ్రద్ధగలవారు. నాగపూరు కాంగ్రెసు యుద్యమకాలమున ఈ గ్రామములో కాంగ్రెసు సభలు సమావేశాలు జరుపబడియున్నవి. గ్రామము చిన్నదైనను యభివృద్ధికర మైనది.

## కడుకుంట్ల

ఈ గ్రామము వనపర్తికి దాదాపు యేడుమైళ్ళ దూరమున నున్నది. ఒక ప్రాథమిక పాఠశాల యవసరము. విద్యా విషయమున ఈ గ్రామము చాల వెనుకబడి యున్నది. ప్రజలంతా వ్యవసాయ వృత్తి గలవారు. విద్యావంతు లుండినను విద్యా విషయమున శ్రద్ధ వహించుట లేదు. ప్రభుత్వము వారు శ్రద్ధతీసికొనవలసినదని ప్రజలు కోరుచున్నారు. గ్రామ పంచాయతీ బోర్డు యేర్పాటు గావింప బడినదను సంగతి తెలియుచున్నది. కొన్ని భూ పంచాయితీ విషయములు, గ్రామములో యెలక్షను సమయమున గలిగిన కొన్ని కలతలు సమైక్యతా భావమున పరిష్కార యోగ్యములుగా నున్నవి. శ్రీ తిమ్మారెడ్డి గారి విశాల స్వభావమున తొందరలో పరిష్కరింప బడ గలవనుటకు సందియ ముండదు. స్థానికులు శ్రీ బాలకిష్టయ్యా పట్వారి గారు గూడ శ్రద్ధ వహించుట యవసరము.

( తరువాయి 27వ పేజీలో )

కథానిక

# ఎలక్షన్ల హడావుడి



శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు

జమీందారు రావుసాహెబ్, ఎలెక్షన్సులో స్టాండై ప్రెశిడెంటు కావాలని పట్టుదల. దివాన్ చౌదరీ కూడా, జమీందారుకు తగ్గవాడే. పట్టుపట్టాడంటే వదలడు. విజయకరగ్రహణం చేసేటంతవరకు నిద్రాహారాలను దగ్గరకు చేరనివ్వడు. నిక్కచ్చిమనిషి. జమీందారుకంట్లో కారంకొట్టి, బీదప్రజల, రక్తమాంసాలు పీల్చి, పిప్పిచేసి కోటీశ్వరుడయ్యాడు. తాను తన భార్యతప్పించి తన ఇంట్లో మరింకొకరు చేరు. పిల్లికి బిచ్చంపెట్ట ఎరుగని దుర్మార్గుడు, కఠిన హృదయుడు. అనేక బురఖాలు తగిలించి, తలలుమార్చి ఆ వూరియందు జమీందారు భవనం తలదన్నేట్టుగా ఒకగొప్ప సౌధం నిర్మించాడు. లక్ష్మి తన చంచల నేత్రములు సుస్థిరంచేసుకొని అతనియింట్లో నివాసంచేస్తున్నది. జమీందారు అమాయకుడు. ఎవరెంత చెబితే అంత. ప్రపంచ లౌకికజ్ఞానం లేనివాడు. పొగడ్తలకుబ్బి తబ్బిబ్బైమురిసి పోతాడు. స్వతహా సులక్షణ సంపన్నుడైనను. దుష్టసమూహము వలన చెడి తాగుబోతై, ప్రజలకష్ట సుఖ, దుఃఖములు, మద, గర్వముచే, కన్నుగానక వారి మాన, ధన, ప్రాణాలు బలిగొని కలియుగ రాక్షసుడని పేరు బొందాడు.

ఒకరోజున దివాన్ చౌదరి మహారాజుతో.

"ప్రభూ మీరు వచ్చే యెలక్షన్లలో తప్పక ప్రెశిడెంటు కావాలని నా ఆశ".

"ఓ! తప్పక, దివాంజీ! నీవుతల్చుకుంటే- మనకి అపజయమంటూ వున్నదా? ఈ ఎలక్షన్సులో మనం తప్పక ప్రెశిడెంటవాల్సిందే. ఇక ఆ భారం నీపై పెట్టుతున్నా. నలుగురిలో అవమానం మటుకు రానీయకండా చూడు."

"ఎంతమాటా. మీకా అవమానం? మీ కవమానం ఐతే మాకు మటుకు కాదా? నా ప్రాణంపోయినాసరే, మిమ్మల్ని తప్పక ప్రెశిడెంటుచేస్తా."

"సంతోషం. డబ్బు ఖర్చులవుతైఅని చూడబోకు. ఇదిగో ఖజానా తాళంచేతులు. నీ యిష్టం వచ్చినట్టు మటుకు చెయ్యి".

"చిత్తం. శెలవు పుచ్చుకుంటా".

(నిష్క్రమించును)

[అది దివాంజీ ఇల్లు. సింహద్వారందాటగనే బాటకిరుప్రక్కల పూలతోటలు, ఫలవృక్షాలు. ఆ బాట వెంబడిపోతే, కొంతదూరంలో ఒక సౌధం. ఆ సౌధం ముందు ఒకపెద్దహాలు. ఆ హాలులో ఒక ప్రక్కన ఒక టేబులు, దానిముందు ఒక సోఫా. టేబులుకు కొంచెం దూరంలో అయిదు, ఆరు కుర్చీలు, టేబులుపైన టేబులుఫాన్, ఫైల్సు మరికొన్ని పరికరాలువుంటయి. ఆ హాలులో చౌదరి ఒక్కడు, సోఫాలో కూర్చొని, సిగరెట్టు త్రాగుతూ ఆలోచనా సముద్రంలో దరిగానక కొట్టు మిట్టాడుతూ వుంటాడు. ఇంతలో ప్లీడరు వెంకటామయ్య ప్రవేశం]

నమస్కారమండి దివాంజీ గారు.

నమస్తే. కూర్చోండి, (అని ఆసనం చూపిస్తాడు)

(ప్లీడరు కూర్చొనును.)

ఏమండి ప్లీడరుగారు, అసలు కనబడటమే మానేశారు. మామీదొక శీతకన్ను పారేశారేమండి.

అబ్బెబ్బే, ఎంతమాట, మేముశీతకన్ను పారేయుట మేమంటండి? మీ దయవుండాలిగాని.

అదిసరేగాని. వచ్చేఎలక్షన్సులో, మన జమీందారుగారు, స్టాండవుతున్నారు. మరి మీ ఓట్లన్నీ. మేమే Expect చేస్తున్నాం. మీక్లయింట్సు, వాళ్ళని, పట్టుకొని ఎట్లాగైనా కనీసం, మీనుంచి ఒక రెండువందల ఓటయినా రావాలి. ఏమంటారు? మనం తేల్చుకోకపోతే, ఇంకెవరండి? ఎట్లాగైనా మన జమీందారుగారు ప్రెసిడెంటు కావాలని మాపట్టుదల. అసలాయన వద్దన్నాడు. మేమే బలవంతంచేసి ఒప్పించాం. వచ్చేనెల, పదిహేనవ తారీఖున పోలింగు. గనుక, ఇప్పటినుంచి ప్రయాసపడితేగాని. గట్టెక్కలేము. మరిమీరు, మీక్లయింట్సుకి, వాళ్ళకి, చెప్పండి. సరే, అసలుసంగతి మరచా, తమరు దేనికివేంచేశారు.

ఆ, ఏమున్నదండి. ఆపొలం పోట్లాటే. మొన్న మళ్లీ ఆ వెంకయ్యగాడు, మా పొలంబోసె. తెగగొట్టాడు. కోర్టుకి పోదామంటే. ఉన్న కేసులతో నే చస్తున్నాను. పైగా ఈ సివిల్ కేసొకటి. కాస్త జమీందారుగారితో మనవిచేసుకోవాలని వచ్చాను. తమ దయవుంటే చాలు.

ఏమిటిరీ మళ్ళీ పొలంబోజ తెగగొట్టాడా సరే, మేం విచారిస్తాంలెండి. ఓట్లసంగతిమాత్రం మరవకండి.

భాభా! తప్పక వేయిస్తాలెండి.

అదికాదండి, మన జమీందారుగారు స్టాండవుతుంటే, మన ఎస్టేటులో వుంటూ మన ఉప్పుకారం తింటూ ఆ శేషగిరిగాడు చూడండి, ఈయనతో కాంపిటీషను. వెధవ, ఏదో కాలేజీలో మిడిమిడిజ్ఞానం సంపాయించుకొచ్చాడు. యీ స్టేటుపాలిస్తున్న జమీందారునే తోసిరాజని, తాను స్టాండవుతున్నాడు, చూశారూ! గనుక మనం వాడికి ఒక్క ఓటు కూడా పడనివ్వకుండా చేయాలి: అదీ మన ప్రతాపం.

నరే! శలవ్ పోయివస్తానండి. (తనలో ఆశముండాకొడుకు, ముందు కాళ్లకి బందాలు బిగించాడు. వీడి తడాఖా నేనెరుగనా, నా మజాచూపిస్తానని అనుకుంటూ) నిష్క్రమిస్తాడు.

మునుపటి భవనం, కొందరు రైతులు (ప్రవేశం)

మొదటిరైతు. అయ్యా దివాంజిగారు, ఈయేడు పంటలు ఎట్లాపండినయో మీకుతెలుసుగదా. దానికి తోడి పార్టీలలో దెబ్బలాటలు. వర్షాలు పడక. పంటలు యెండిపోయి నాశనమైనాయి. కాన దయుంచి, ఈ సంవత్సరం శిస్తు వచ్చేఏటిలో కట్టేస్తాం. తప్పక ఈ సారి క్షమించండి బాబు.

రెం, రై. గొడ్డుగోదా, మేతలేక, చస్తున్నాయి, దయచూపించండి ప్రభువులుగారితో మనవిచేసుకోడానికి వచ్చాంబాబు.

రైతులారా, మీ ఆపదలను ఆలకించాం. మీరు ఈ సంవత్సరం పంటలో సగం ఉచితార్థం, మీరు చేసినపనికి, జమీందారుగారు బహుకరించారు. మీకేమీ చింతిల్లవద్దు మహాప్రభు, జమీందారు దయ నేడు మీ వైపు ప్రసరించింది. మరియొకటి, ప్రభువుగారు. ఈ యేడు యెలక్షన్లలో ప్రెసిడెంటవబోతున్నారు. కాన మన మందరం, ఆయనను గెలిపించాలి. అదే మన బాధ్యత. గనుక మీరు, మీ ఓట్లన్ని ప్రభువుగారికే వేస్తారని, మేము అనుకున్నాం. మీ సుఖదుఃఖములను చూచి విచారించు బాధ్యతా విచారణలుమావి. ప్రజల కష్టసుఖములే మావి. మీ ఇళ్ళు బాటలు, బాగుచేయించి, మీకు సరియైన విద్యాబోధనలు బోధించి మిమ్ములను దేశ నాయకులుగా, చేయ నిశ్చయించి, జమీందారుగారు మీ కొరకు కొత్త పాఠశాలలు, స్థాపింప నిశ్చయించారు. కాన మనం, మన జమీందారుగారి అడుగు జాడలలో నడచి, ఆయనను ఈ యెలక్షన్లలో గెలిపించవలసిన విధమనది. కాన మీరు తప్పక మీ ఓట్లు, జమీందారుగారి పక్షమని నే విశ్వసిస్తున్నాను. ఇక మాకుశలవు.

(దివాను నిష్క్రమించును.)

(రైతులలో)

1 వ. రైతు. చూశావురా పుల్లా, ఈతడు మనకి చదువుచెప్పిస్తాడట. మనఇల్లు మరమత్తు చేయిస్తాడట. ఏంపోకడలు పోయాడురా దివాంజిగాడు.

రెం, రై. కాకపోతే ఏమిటోరి, కిందటిసారి ఏమని చెప్పాడు, ఈ విధంగానేగా దొంగముండాకొడుకు, ఇప్పుడు శిస్తుతగ్గించాడు. రేపు ప్రెసిడెంటు అయ్యాక ఇంతకు పదింతలు గుంజుతాడు. ఈడికట, ఓటువెయ్యాలి మెదడున్నవాడెవడు ఈడికిచచ్చినా ఓటెయ్యడు. పదండిరా ఆసీసగికినే, అడుగుదాం. ఈడిని అడిగేదేంటి ? కష్టాలు పడ్డాడికి, కష్టాలంటే, ఏమిటో తెలుస్తాయి, ఇటువంటి తాగుబోతులకేం తెలుస్తాయి, పదండిరా పోదాం. (నిష్క్రమింతురు)

శేషగిరి. బి ఏ. వరకు చదివాడు. తండ్రిని వేధించి తల్లిని హతమార్చి, కాలేజి చదువు వెలగబెట్టాడు, ఏదో ఆఫీసరు అవుదామని బి. ఏ, ప్యాసయ్యాక, ఉద్యోగమంటే విరక్తి పుట్టింది. స్వతంత్ర జీవనోపాయ మన్వేషింపసాగాడు. చివరకు, ఉన్న నాల్గు ఎకరాల మాగాణి భూమిని సేద్యం చేయ నారంభించాడు. ప్రజలు పడుతున్న బాధలను వీక్షించి, ధన మదాంధతచే, న్యాయా న్యాయ, విచక్షణా విచక్షతలు. విచారింపక, ఘోరనరరూప రాక్షసులై, ధనవంతులు చేయు, చెయరాని క్రూరకార్యముల నరిగట్ట దలచాడు వీరు చేయుపనులకు నితని ఉడుకు రక్తం ఉప్పొంగింది. చేసేవి గంగాస్నానలు, దూరేవి దొమ్మరిగుడిసెలు, చెప్పేది నీతివాక్యాలు, చేసేవి క్రూరకార్యాలని, అతని మనస్సు ఆక్రోశించింది. ఎట్లాగైనా ఈ ధనవంతుల మదాన్ని అతః పాతాళానికి, అణచివేయాలని అతనికి పట్టుదలతోనే, ఎలక్షన్లలో స్టాండయ్యాడు.

ఆనాడి ఎలక్షన్సు పోలింగురోజు పట్నాలు పల్లెటూర్లు ఓటర్లతో కిటకిటలాడుతున్నది. యేమూలనినాదాలే ఏ ప్రక్కచూచినా కేకలు చప్పట్లు పోలింగు సేషనుచుట్టు జనం కిటకిటలాడు తున్నారు. జమీందారు పార్టీకి జై, శేషగిరి పార్టీకి జై అన్న కేకలు మిన్నుముట్టుతున్నయ్. ఆబాలగోపాలమంతా జమీందారుగారి కార్లలోను బళ్ళలోను వచ్చారు.

( 27వ పేజీలో )

# పల్లెటూరి పఠనాలయము

## సమీక్షలు

### నీడ

కవి:— శ్రీ చొల్లేటి నృసింహ కవిగారు.

ఈ ఖండ కావ్యము భువనగిరి ఆంధ్ర సారస్వత పరిషత్ పక్షమునుండి ముద్రింప బడినది. శైలిచాలా మృదువుగా నుండి భర్త సేవలో మెలగిన గృహిణీ వియోగము తేట పడుచున్నది. గృహస్థాశ్రమ వాసులు చదివి నేర్చుకో వలసిన యంశము లెన్నో గలవు. ముఖ్యముగా గృహిణులంతా చదువుటకు ఆదర్శముగా నున్నది. ఈ కవిగారు ఆంధ్రి సారస్వత ప్రియులు. చక్కని శైలిలో భావ ములుట్టిపడ పద్యముల్లు నేర్పుగలవారు. ఆంధ్రిసారస్వతమునకు వీరు చేసిన సేవ కొని యాడ దగినది.

### తెలంగాణా తీరు తెన్నులు

తెలంగాణా తీరు తెన్నులు తెలుగు ప్రజల భావతరంగములు అణిగియున్న భావాలంతా యున్నదున్నట్లు ప్రస్ఫుటము జేయు గ్రంథకర్త గారి నేర్పుపాఠకులకు పదపదమున స్ఫురించక వచ్చుచుండును. పుస్తకము చదువ మొదలిడిన విడువబుద్ధిపొడుమదు. పల్లెవాసుల జీవితాలను తెలుగువారి పలుబాములను కమ్యూనిస్టుల కార్యరూపాలను కార్యకర్తలందరము కన్న కలుషిత వాతావరణమున కలువరపెట్టు స్థితి గతులను కండ్లకుదుట కనపడునట్లు గ్రంథకర్త గారు రచనా రంగమున తేటపరచినారు. అనేక సమస్యలను లేఖారచన మార్గమున యథార్థ యుద్దేశములను నిష్పక్షపాతముగా వెల్లడి జేసినారు. తెలంగాణాలో పరిష్కరింప బడే విషయాలను సంస్కరింపబడే విధానా లను చదువరులు గ్రహించుటకు ఆచరణలో పెట్టుట కనువుగా నుండునట్లు గోచరింప జేసి నారు. ఈ గ్రంథములో ప్రతియంశముచూడ దగినదిగా యున్నది. గ్రంథకర్త శ్రీ భవదీ యుని యున్నత భావాలు ఈ రచనల వలనే తెలియు చున్నవి. ప్రతివారు చదువ యోగ్య ముగా నున్నది.

గ్రంథము వెల ఒకరూపాయి. దొరకు స్థలము నారాయణగోడ జనపద ప్రచురణలు హైదరాబాద్.—

### గీతా వాణి

గీతావాణి జయంతి ప్రత్యేక సంచిక

కారవసంపాదకులు శ్రీ పూజ్యపాద శంక రానంద స్వామిజీగారు. గీతావాణి కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డనుండి మాశాత్యాలయమున కందించి. సంచిక వెల ఒకరూపాయి. సంవ త్సరము చందా నాలుగు రూపాయలు

గీతావాణి సుప్రసిద్ధ మహనీయుల సద భిప్రాయములతో గూడి, మహారాజపోషకుల చిత్రములతో నలంకృతమై యున్నది. గీతను గూర్చిన శ్రీ కృష్ణోపదేశములు ప్రకటీ కృత మైనవి. రచయితల రచనలు వారివారి చిత్ర ములతో పఠనార్హములైన ముప్పది రెండు వ్యాసములిమిడి యున్నవి. చదువ నాకర్ష ణీయముగు సీగీతావాణి చదువరులకు సద్గతు లను చూపెట్టునదే గాక యిహ పరసుఖ ప్రాప్తిని గూర్చునదై యున్నది. శ్రీ యన్, శ్రీ కంఠముగారి సంపాదకత్వమున గీతావాణి దినదినాభివృద్ధిగాంచి నేటికాలమున సుఖ శాంతి చేకూర్చునసుటకు సందియ ముండదు.

## పత్రికా స్వీకారము.

### ప్రజావాణి

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వమున వెలువడు ద్విదిన పత్రిక. సంవత్సరము చందా రు. ౧౫ లు. అర్థసంవత్సర చందా రు. ౮లు. విడిపత్రిక ౦-౧-౬ లు

### నేత

శ్రీ. వి.జి. గూడ బి.ఏ. గారి సంపాదకత్వమున వెలువడుచున్నది. సహకార, కుటీర. నేత, పరిశ్రమలను. వృద్ధిపరుచు ౮ పుటలతో నొప్పు వారపత్రిక. చందానిర్ణయము చూపెట్టలేదు. హై. రాజమొహల్లా నేత ప్రెస్ నుండి వెలువడును

### సంఘము

శ్రీ గోపరాజు రామచంద్ర రావుగారి సంపాదకత్వమున వెలువడు వార పత్రిక. సంవత్సరము చందా రు 6-8-0 లు అర్ధ సంవత్సరము. రు. 3-4-0 లు. మూడు నెలలకు రు. 1-10-0 లు. కార్యస్థలము పటమట విజయవాడ.

---

వార్తలు - విశేషాలు (25 పేజీ తరువాయి)

యున్నది. సహకార సంస్థల ద్వారా దానిని యెదుర్కొని సల్పినకృషిని హైదరాబాదులో ప్రవేశపెట్టబడిన భూసంస్కరణ శాఖనుగూర్చి డాక్టర్ ఆర్. వి. రావుగారు తెలిపిన విధానాలకు అర్థిక మహాసభ ప్రతినిధులు చాల సంతోషపడినారు.

#### నాయీ బ్రాహ్మణ సభ

డిసంబరు నెలలో 11 తేది నాయీ బ్రాహ్మణ సంఘం శ్రీ కె. రామయ్యగారి అధ్యక్షతలో హైదరాబాదు నగరమున జరిగినది. అందులో ఈ విధముగా తీర్మానములు గావింపబడినవి.

పనిచేయు కాలము 8 గంటలకు బదులు 10 గం. లున్ను మరియు వ్యాపించు కాలము 12 గం. లకు బదులు 14 గం. లవరకు అనుమతింప వలయుననియు. ఆదివారము బక్రీదు సెలవు మాకు వర్తింప బడదనియు, మాకు ప్రజలకు అందువలన నష్టముగాకుండ క్రమముగా కుండ వేరేపండుగదినములకుఅనుమతింపవలయుననియు ఈ సంఘము లేబరుమంత్రిగారిని ప్రార్థించుచున్నది.

ఈ విషయమున యావన్మంది గుమాస్తాలు మాతో ఏకీభవించుచున్నారని మార్పులు అవసరమని ప్రవేశపెట్టిన తీర్మానము ఏకగ్రీవముగా నామోదింపబడెను.

---

(22 వ పేజీ తరువాయి)

వనపర్తి తాలూకాలో స్థానికమున యున్నతపాఠశాల యుండి విద్యా విషయమున మొదటినుండి చాల సేవ జేయుచున్నది. పల్లెటూళ్లలో విద్యావ్యాపకము కావలసియున్నది. ప్రజలు కాంగ్రెసుపైన విశ్వాసము గలవారు. విఖ్యాతులగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు వనపర్తి నియోజక వర్గమున నిలిచినారంటే, సుమితోత్సాహము ప్రజలలో పొడసూపినది. శ్రీ ప్రతాపరెడ్డిగారు ప్రచార సమయమున ఊరూరా సమావేశాలలో నుడివిన కాంగ్రెసు సిద్ధాంతాలు ప్రజల హృదయాలను వికసింపజేసినవి.

వనపర్తి సీట్ల సంఖ్య, 55, 142. ఇందులోపోలైన వోట్లు 26,575. సురవరము ప్రతాపరెడ్డిగారికి 15,434. రామచంద్రారెడ్డి స్వతంత్రులకు 11, 141. విజయము శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారిని వరించినది.

---

( 24వ పేజీ తరువాయి )

ఇక అమపని పట్టిదని శేషగిరిపార్టీవారంతా బెలబల భాళేసారు. కాని నిజం తప్పక జయిస్తుందని, శేషగిరి నమ్మకం.

ఆనాడే వోట్లు లెక్కించారు. తాను సప్తసముద్రాలేకమైనా, రవిచంద్రులు నేలకూలినా తప్పక ప్రెసిడెంటవుతానన్న క్షేమాతో జమిందారు తన శ్యాంగాం మంటపమందు సర్వాంగ నుంచి గుడుపుతున్నాడు.

ఇంతలో దివాంజీగారు రొప్పుతూ పరిగెత్తుకొచ్చి ప్రభూ అయిపోయింది అన్నారు.

ఏమిటి, అల్లకల్లోలంతో అయిపోయిందా ఏమిటి వస్తున్నా పదా అన్నారు.

కామప్రభూ ఆ శేషగిరి ప్రెసిడెంటయ్యాడు. ప్రజల తా మోసం చేశారు. మన కారులో వచ్చి వాడికి వోట్లు వేసేశారు. ప్రభూ.

ఆ! అంత ద్రోహం నాయనా. నా ఉప్పుకారం తింటూ తలపెట్టారా గాడిద కొడుకులు. దివాంజీ, అసలు, వడ్డీలాయి బాలతో, కట్టింపుచేసి ప్రజల నుంచి శిస్తులు పోగుచెయ్యి.

ఇంతలో మరి ఒక గుమాస్తా పరిగెత్తుకొచ్చి ప్రభూ ఏమిటి ?

(తడబడుతూ) "మన యూనియను యీ నిమిషంనుంచి Union లో కలిసిందట. తమకు భరణం ఇస్తారట. ఇప్పుడే అర్డరొచ్చింది.

"ఆ! అంటూ సోఫాలో కూలబడ్డారు జమీందారు నిరాశా నిస్పృహలతో.

